విసడమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం
సంపాదకుడు:
లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ., ఎల్.ఎల్.బి.,
గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్.సి.,
వి.బాలకుమార్ ఎమ్.ఏ., బి.ఎల్.,
సభ్యులు:
కె.వి.ఎస్. శరత్‌బాబు బి.ఏ., బి.కాం., బి.ఎల్.,
కె.వి.ఎస్.విజయకుమార్
కె. రత్నకుమారి

చందా వివరాలు
అభిమాన జీవిత చందా.. రూ॥ 1000/-
జీవిత చందా .... ....... రూ॥ 300/-
3 సంవత్సరాల చందా .. రూ॥ 70/-
సంవత్సర చందా .. .. రూ॥ 24/-
ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ॥ 125/-
సీ మెయిల్ (1 సం॥).... రూ॥ 70/-
చందా పంపవలసిన చిరునామా
విసడమ్
9, దేశికా రోడ్, మైలాపూర్
మద్రాసు - 600004

## ఈ సంచికలో

అగస్టు 1988



> తెలుగు విసడమ్‌కు ఇది ఏడవ సంవత్సరం <

## ధ్యానం

### ఆదర్శ జీవితానికి ఆకాంక్ష




జీవికి సుఖేచ్ఛ సహజం. ప్రతి మానవుడు సుఖపడాలనే కోరుకుంటాడు. ఆ కోరికతోనే ఏపనైనా చేస్తాడు. నేర్పు, నైపుణ్యం ఉంటే సుఖం కలిగించే పనులు చేసుకుంటాడు. నేర్పు లేదా సుఖాన్నే కోరి కూడా తెలియక దుఃఖాన్ని కలిగించే పనులే చేస్తాడు. కేవలం లౌకిక సుఖాలు మానవునికి ఉండవలసిన సుఖాలలో ఒక భాగం మాత్రమే. తీవ్రమైన ఆకాంక్షతో ఉత్తమ ఆధ్యాత్మిక జీవితం సాధించడమే మానవుని ధ్యేయం. మోక్ష సాధనానికి బాగా అరితేరిన బ్రహ్మానంద సుఖం ఏ కొంచెమైనా రుచి చూచేవరకే ప్రాపంచిక విషయాలు ప్రలోభపెడతాయి. మహోత్కృష్టమైన దివ్య జీవితం కోసం మానవుడు ఆతురపడతాడు. అప్పుడు అతనిలో ఆకాంక్ష బయలుదేరుతుంది. పాపరహితమైన నిష్కళంక పరిశుద్ధ జీవితం కోసం ఆరాటపడాలి. (మిగతా 8 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### వ్యాయామం ప్రాముఖ్యత

మన పాఠశాలలలోను, ఇతర విద్యా సంస్థలలోను వ్యాయామ శిక్షణకు తగిన ప్రాముఖ్యతను ఇవ్వాలి. ఆరోగ్యమే మహాభాగ్యము. ఆరోగ్యం లేకుండా శారీరకంగా, మానసికంగా ఏ పనిని చేపట్టలేరు. చేపట్టిన పనిని పూర్తి చేసి విజయం సాధించలేరు. ఆనందంగా సంతోషంతో దీర్ఘకాలం జీవించడానికి ఆరోగ్యం అవసరం.

వ్యాయామ విద్యవల్ల జీవితంలో విజయానికి అవసరమైన సహనశక్తి ఓర్పు, పట్టుదల, న్యాయశీలత, నిష్కాపట్యం పోషింపబడి ప్రవృద్ధి పొందుతాయి. వ్యాయామంవల్ల సంఘజీవనం, క్రమశిక్షణ, కృతనిశ్చయం, ధర్మచింతన, శ్రద్ధ, అభినివేశము వృద్ధిపొంది విజయం సిద్ధిస్తుంది.

నియమాలకు, నిబంధనలకు విధేయత అలవడుతుంది. పరస్పర సహకార భావము, ఆత్మనిగ్రహము, త్యాగబుద్ధి, ధైర్యసాహసం అధికమవుతాయి. గొప్ప గొప్ప నాయకులందరు క్రీడారంగాలలో మొదటి పాఠాలను నేర్చుకుని జీవితంలో అనుసరించినవారే.

విద్యార్థులకు ఆటలలోను, క్రీడలలోను క్రమశిక్షణ కలిగిస్తే, నీతినియమాలు పెరుగుతాయి. వ్యాపారరంగంలో గానీ, రాజకీయరంగంలో గానీ, సాంఘిక కార్యకలాపాలలో గానీ ఉత్సాహంతో

'అందమైన కావ్యానికి సందేశం తోడైతే బంగారానికి పరిమళం అబ్బినట్లు ఉంటుంది.

పాల్గొంటు న్యాయంగా ప్రవర్తిస్తారు. తగిన వ్యాయామ విద్య లేకుండా, శారీరకాభివృద్ధి లేకుండా సాంకేతిక విద్య అభ్యసించడం కేవలం వృధాశ్రమ. శారీరక పటుత్వం, దేహదార్ఢ్యం కలవారు జీవితంలో ఏ రంగంలో నైనా రాణిసారు.



ప్రాచీన కాలంలో భారతీయ యువతీ యువకుల శక్తి సామర్థ్యాలకు, నైపుణ్యాలకు, మరుకుదనాలకు విదేశీయులు ఎంతో విస్మయం చెంది మెచ్చుకున్నారు. రానురాను శారీరక పటుత్వం తగ్గిపోయింది. ఈనాడు సగటు భారతీయునికి సక్రమ పోషకాహారం గురించిన ప్రాతిపదిక ధర్మాలు తెలియవు. శారీరకాభివృద్ధికి తగిన చర్యలు తక్షణం అవలంబించాలి. దేశ సంరక్షణకే కాదు, భావి భారతజాతి భారతీయ సంస్కృతోన్నతితో ప్రవృద్ధి పొందడానికి వ్యాయామం అవసరం.

(2 వ పేజీ తరువాయి)

కేవలం భౌతిక సుఖాలతో తృప్తిపడే లౌకిక జీవితం కంటె మహోజ్జ్వలమైన పారమార్థిక జీవితాన్ని ఆకాంక్షించు. తేజోవంతమైన విశ్వజీవితం ఆకాంక్షించేవారు ధ్యానం అభ్యాసం చేసుకుంటారు. త్రికరణశుద్ధిగా ప్రయత్నించేస్తే సాధకుడవు కాగలవు. తీవ్రమైన ఆకాంక్ష లేకుండా ధ్యానం చేయలేవు. సోమరితనం, నిరుత్సాహం, ఉపేక్ష, ఔదాసీన్యం ధ్యాన సాధనకు అంతరాయాలు ఆధ్యాత్మిక జ్ఞానం మానవునికి తరగని సంపద. దీనివల్లే నీకు తృప్తి, సహనభావం, ఆనందం అయాచితంగా లభిస్తాయి. ఇటువంటివారు ఇతరుల మేలుకొరకే జీవిస్తారు. దీనికి ధైర్యం ఓర్పు, ఆత్మ విశ్వాసం ఉండాలి ఇవి ఆధ్యాత్మిక జీవనంవల్ల అలవడుతాయి. ఆధ్యాత్మిక మానవుని సహజ గుణాలలో వైరాగ్యం ఒకటి: దీనివల్ల తనకు ఉందనిగానీ, తనకు లేదనిగానీ దుఃఖం ఉండదు ప్రయత్నానికి తగిన సుఖం, సంపద లభిస్తాయి. భౌతిక సంపదతో ఆధ్యాత్మిక సంపదను సమన్వయం చేసుకుంటూ జీవిస్తే ఆత్మ సాక్షాత్కారం పొందుతావు. జ్ఞానం సిద్ధిస్తుంది. తత్త్వ జిజ్ఞాసతో పాటు ధర్మ జిజ్ఞాసను కూడా కొనసాగించు. సుఖ దుఃఖాలు ఉపశమిస్తాయి. అనుభూతి అనే ఆనందంలో విహరిస్తావు.

అయాచితంగా సంభవించినది అమృతతుల్యం



# పోతన

సీతా రవిచంద్రన్

ఆంధ్రభాష - అదే తెలుగు భాష. మృదుమధురమైన భాష. తేనె సొనలు జాలువారు భాష. దాని సౌందర్యం, అది సంతరించుకున్న పుష్టి, అది ఎదిగిన రీతి, అది చూపిన సొగసు, అది అలవరచుకున్న సభ్యత హృదయానందకరం. 'దేశభాషలందు తెలుగు లెస్స' అని చెప్పిన రాయలసూక్తి అత్యుక్తి కాదు. 'జనని సంస్కృతంబు సకల భాషలకును' అనే కవి వాక్కు సముచితమే. ప్రపంచ భాషలన్నిటికీ సంస్కృతం మణిపూస. భారత దేశీయ భాషలలో అంతటి భావనాపటిమగల భాష తెలుగు. తెలుగు నుడికారం మృదుమధుర భావగర్భితం. హృదయాహ్లాదకరం. సంస్కృత పదాలను, అన్యపదాలను తనలో జీర్ణించుకుని మరింత నిండుతనంతో, ప్రతిభతో, పరువంతో ప్రకాశిస్తుంది రాయలు తన ఆస్థానంలో అష్టదిగ్గజాలని పేరొందిన పెద్దనాది కవీంద్రులను పోషించడంలోను, తాను స్వంతంగా 'ఆముక్తమాల్యద' అనే మహా ప్రబంధం తెలుగులో రచించడంలోను, 'దేశభాషలందు తెలుగు లెస్స' అని చెప్పడంలోను తెలుగుకు ఉన్న ప్రత్యేకత ప్రకాశిత మౌతుంది. దీనివల్లే అనాంధ్రులైన దక్షిణాత్యులు అనేకమంది తెలుగులోనే అవిరళ కృషి చేశారు. పాశ్చాత్య విద్వాంసులు తెలుగును "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అనడానికి ఇదే కారణం. ఇంతటి మహోత్కృష్టమైన తెలుగు భాషలో—

బాల రసాల సాల నవపల్లవ కోమల....
బాలురకు పాలులేవని....
చేబంతి తప్పిపడెనని....
ఓయమ్మ నీకుమారుడు....
కలయో వైష్ణవ మాయయో....
నల్లనివాడు పద్మనయనంబులవాడు ..
ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల....
మందార మకరంద మాధుర్యమున దేలు..
అలవైకుంఠ పురంబులో ....
సిరికిం జెప్పడు....

మొదలైన పద్యరత్నాలు తెలుగువారు ఆబాల గోపాలం నిత్యం స్మరించేవి. ఇవి తెలుగు భాగవతం లోనివి. తెలుగు భాగవతం పోతన రచించాడు. పోతన శ్రీనాథుని సమకాలీనుడు, దగ్గరి బంధువు కూడా. పోతన అనే పేరు వినడంతో ఆయన ఎటువంటి వాడో వెంటనే స్ఫురణకు వస్తుంది. భక్త పోతన శ్రీరాముని సాక్షాత్కారం పొందిన పరమ భాగవతోత్తముడు. సహజ పాండిత్యం ఆయన వేదాంతాధ్యయన జ్ఞానాన్ని సూచిస్తుంది—

పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండటనే
బలికిన భవహర మగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా

అని చాటిన మహాభక్త కవి.

"నీవు అజ్ఞానుడవని తెలుసుకోడం వివేకానికి మార్గం." —బెంజమిన్ డిజ్రేలి

పోతన నివాసస్థలం 'ఏకశిలానగరం' అని అతడే చెప్పుకున్నాడు. దీనినిబట్టి ఇతడు దపమండలంలో ఏకశిలానగరం 'ఒంటిమిట్ట' నివాసి అని కొందరు అంటారు. మరి కొందరు నిజాం రాష్ట్రంలో ఒరంగల్లు (ఏకశిల) నివాసి అంటారు. ఇంటి పేరు బమ్మెర'. బమ్మెర అనే గ్రామం ఓరుగల్లు (ఒరుగల్లు) సమీపంలో ఉంది. కాబట్టి మన పోతన కొంతకాలం బమ్మెరలో ఉండి ఓరుగల్లు, ఏకశిలా నగరంవెళ్ళి ఉండాలి. ఎక్కడ పుట్టినా, ఎక్కడ పెరిగినా పోతన సుప్రసిద్ధ భారతదేశ కవీంద్రుడు.

పోతన - శ్రీనాథులు సర్వజ్ఞసింగ భూపాలుడికి సమకాలికులు అనే అభిప్రాయం ఉంది. కానీ సర్వజ్ఞభూపాలుడు రాజ్యపాలనం క్రీ.శ. 1422 నుండి క్రీ.శ. 1447 అని కొందరు క్రీ.శ. 1430 నుండి క్రీ.శ. 1475 అని మరికొందరు అంటారు. ఈ కారణాల చేత పోతన 15 వ శతాబ్ద మధ్యకాలం వాడని ఊహించుకోవాలి

ఇతడిది కౌండిన్య గోత్రం. ఆపస్తంబ సూత్రుడు. శివధ్యాన తత్పరుడు. తండ్రి కేసన మంత్రి. ఇతడు శివారాధన తత్పరుడు. తల్లి లక్కమాంబ. అన్న తిప్పన - ఈశ్వర సేవాకాముడు. కుమారుడు మల్లన, మనుమడు ప్రౌఢసరస్వతి. ముని మనుమలు కేసన, మల్లన కవులు. ఈ విధంగా పోతన వంశం అంతా పరమేశ్వర ధ్యానంతో పరమ పూజ్యమైనది. పోతన నిరాడంబరుడు. వ్యవసాయ వృత్తే జీవనముగా గడిపిన ధన్యుడు. అనేక మంది కవులు ఏదో ఒక రాజునో, ప్రభువునో ఆశ్రయించి ధనికులై జీవించినవారే. కానీ పోతన ఎంత దరిద్రం అనుభవిస్తున్నా ఏ రాజునూ ఆశ్రయించకుండా కేవలం వ్యవసాయవృత్తితో భక్తిభరితమైన భాగవతాన్ని రచించి శ్రీకృష్ణపరమాత్మకి సమర్పించిన పుణ్యుడు. సాధుజన యుక్తుడు. సహజ పాండిత్య బిరుదాంకితుడు. పోతన కవితా పాండిత్యాలు భాగవతంలో నిండుగా పండాయని పండితుల అభిప్రాయం.

పోతన ఏ గురువులవద్ద ఏ విద్యలు అభ్యసించాడో చెప్పలేం. కానీ "చదువుల మర్మమెల్ల చదివితి తండ్రీ" అన్నట్లు అన్ని విద్యల రహస్యాలు ఆయనకి కరతలామలకములని ఆయన రచించిన భాగవతమే చెపుతుంది. పోతన చిదానందయోగివల్ల మంత్రోపదేశం పొందాడు. ఆ మంత్ర జపప్రభావంతో కవితా నైపుణ్యం పొంది సహజపండితుడై భాగవతాన్ని తెలుగు చేశాడు. ఇతడి ఇతర రచనలు భోగినీ దండకము, వీరభద్ర విజయము. పోతన రచించిన తెలుగు భాగవతం 12 స్కందాల భక్తిరస పూరితమైన గ్రంథం వ్యాస భగవానుడు సంస్కృతంలో రచించిన దానికి తెనుగు. వ్యాసులవారు సంస్కృతంలో 20 వేల శ్లోకాలు వ్రాస్తే, తెలుగులో పోతన 30 వేల పద్యాలు రచించాడు.

అనాడు కాకతీయ రాజ్యం విచ్ఛిన్నమైపోయింది. విజయనగర రాజులు, కొండవీడు రెడ్లు, రాచకొండ వెలమరాజులు, కటకం గజపతులు విజృంభించారు. హిందూరాజులకు, బహమనీ సుల్తానులకు మధ్య నిరంతరం పోరాటాలు, యుద్ధాలు జరిగాయి. ఇట్టి రాజకీయ సంక్షోభంలో పోతన రచించిన భాగవతానికి అపాయం వాటిల్లింది. దీంట్లో కొన్ని భాగాలు నశించిపోయాయి. పోతన భాగవతం శిథిలమైపోవడం గురించి ఇతర కథలు ఎన్నెన్నో ప్రచారంలో ఉన్నాయి. ఈ శిథిలమైన భాగాలలో పంచమస్కందము మొదటి

...నంతో పాపకర్మలను దూరం చేసుకోవాలి.

రెండవ ఆశ్వాసాలు గంగన పూరించాడు. షష్ఠమస్కందాన్ని సింగన రచించాడు. ఏకాదశస్కంధం. ద్వాదశస్కంధము పూర్తిగా వెలిగందల నారయ వ్రాసాడు మనకు ఇప్పుడు లభించేది ఈ విధంగా శిథిలభాగాలు పూరించిన భాగవతం. దశమస్కంధము అత్యంత హృద్యమైనది. ఇది తెలుగు భాగవతానికి మణిమకుటం వంటిది. శ్రీకృష్ణుడు అవతరించుట. శ్రీకృష్ణ బలరాముల బాల క్రీడాభి వర్ణనము, శ్రీకృష్ణుని లీలలు, గోపికలు యశోదా దేవితో శ్రీకృష్ణుని చేష్టలు చెప్పుకొనుట. మృద్భక్షణం, విశ్వరూప దర్శనం, కాళీయమర్దనం, గోపికా వస్త్రాపహరణం మొదలైన కృష్ణుని కథలన్నీ అతి సుకుమారంగా భక్తిరసం పొంగి పొర్లేటట్టు వర్ణింపబడ్డాయి.

పోతనను గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. పోతన అనుభవిస్తూన్న కటిక దారిద్ర్యాన్ని చూచి బావ శ్రీనాథుడు అతనిని ఎలాగైనా ఒప్పించి భాగవతాన్ని కర్ణాటాధీశునికి ఇవ్వమని చెప్పడానికి ఒక నాడు పల్లకీలో ఒంటిమిట్టకు బయలుదేరాడు. ఊరి పొలిమేరల పోతన పొలంలో కొడుకు మల్లనచేత పొలం దున్నిస్తున్నాడు. శ్రీనాథుడు ఇది చూచి తన మహాత్మ్యాన్ని చూపించడానికి పల్లకి ముందటి దండెను మోసేవారికి దండెను విడిచి పెట్టమని చెప్పాడు. వారు పల్లకి వదలి మోయడం మానేసారు. కానీ పల్లకి మామూలుగానే పోతూంది. పోతన ఇది చూచి నాగలి కాడికి కట్టిన రెండు ఎద్దులలో ఒక ఎద్దును విడిచేయమని మల్లనకి చెప్పాడు. మల్లన అలాగే ఒక ఎద్దును విడిచిపెట్టాడు. నాగలి యథా ప్రకారం భూమి దున్నుతూంది. శ్రీనాథుడు వెంటనే రెండవప్రక్క పల్లకీని మోసేవారిని కూడా విడవమన్నాడు. ఈసారి పల్లకీ మోతగాళ్ళు లేకుండానే జరిగిపోతూంది. పోతన నాగలికి కట్టిన రెండవ ఎద్దునుకూడా విడిచేయమన్నాడు. ఇప్పుడు నాగలి ఎద్దులు లేకుండా దుక్కి సాగిపోతూంది. అప్పుడు శ్రీనాథుడు పోతన మహిమకు ఆశ్చర్యపడి పల్లకి దిగి పోతన దగ్గరకు వచ్చి కుశలమా అని అడిగాడు. అప్పుడు పోతన 'బాలరసాలసాల నవపల్లవ కోమల' అనే పద్యం చెప్పాడని ప్రతీతి.

భాగవతంలో గజేంద్రమోక్షం కథలో మొసలి పట్టి ఈడుస్తున్నప్పుడు గజేంద్రుడు రక్షింపమని విష్ణువుని ప్రార్థించినప్పుడు పోతన వ్రాసిన 'సిరికిం జెప్పడు శంఖచక్ర యుగముం చేదోయి సంధింపడు' అనే పద్యాన్ని ఎత్తిచూపి, ఏ సన్నాహం లేకుండా

(మిగతా 43 వ పేజీలో)

## త్రాచుపాము కాటువల్ల 10,000 మంది మరణిస్తున్నారు



ప్రతీ సంవత్సరం ఆసియాలోను, ఆఫ్రికాలోను 10,000 మందికి పైగా త్రాచుపాము కాటువల్ల మరణిస్తున్నారు.

"దేవుడు అంతర్యామిగనుక ఎంతవారిలో అంతవాడుగా ఉంటాడు."

# ప్రపంచంలో రైనో జాతులు

రూపాల్ రావల్

భూమిమీద వివసించే ఏనుగు, హిప్పో పోటమస్ తరువాత అతి భయంకరంగా, బ్రహ్మాండంగా కనిపించే గంభీరమైన జంతువు గాండామృగము (రైనో). ఇది ఇప్పుడు చాలా అరుదుగా కనిపిస్తున్నా 5000 సంవత్సరాల క్రితం ఇవి అమితంగా ఉండేవి. ఇటీవలి కాలంలో కెన్యా (తూర్పు



ఆఫ్రికా)లో ఈ రైనోలు వేటాడి చంపబడ్డాయి. 1970 వ సంవత్సరంలో ఉన్న 20,000 రైనోలలో 550 మాత్రమే బ్రతికి ఉన్నాయి.

అనేక శతాబ్దాల నుండి రైనోసరస్ కొమ్ములు రకరకాల కప్పులు, గిన్నెలు, కత్తులు, అమ్ములు, పొదులు, కత్తిపిడులు, అందమైన నగిషీ వస్తువులు, చేతికర్రలు, తలుపులకు చేతిపిడులు మొదలైన లెక్కలేనన్ని వస్తువులు తయారీకి ఉపయోగిస్తున్నారు. ఉబ్బసము, క్షయ మొదలైన రోగాలకు, పాము కాటులకు రైనో కొమ్ము, చర్మము ఔషధంగా వాడతారని కొందరి నమ్మకం. దీనికి ధాతువృద్ధి కారక గుణాలు కూడా ఉన్నాయని పలువురి నమ్మకం. ప్రపంచంలో ముఖ్యంగా మూడు జాతుల ఏసియాటిక్ రైనోలు-ఇండియన్ రైనోలు, జావా రైనోలు, సుమత్రా రైనోలు; రెండు జాతుల ఆఫ్రికా రైనోలు తెల్లరైనోలు, నల్లరైనోలు మొత్తం అయిదు జాతులు ఉన్నాయి. ఇటీవలి లెక్కల ప్రకారం సుమారు 70 జావా రైనోలు, 500 సుమత్రా రైనోలు మాత్రమే ఉన్నాయి.

ఇండియన్ రైనోలు పెద్ద ఒంటి కొమ్ముతో ఉంటాయి. ఒకప్పుడు ఇవి హిమాలయ పర్వతపాదప్రదేశాలలో విస్తా

## విస్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83 మార్చి '84 నుంచీ జూన్ '84; ఆగస్టు '84 నుంచీ నవంబరు '84; జనవరి '85, మార్చి '85 నుంచీ అక్టోబరు '85; జనవరి '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87 నుంచీ డిసెంబరు '87 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీ వెల. పై 0. ు; 1984 కాపీల వెల రూ. 1985 కాపీల వెల రూ.

రంగా టెరాయి (Terai) ప్రదేశంలోను, ముఖ్యంగా ఇండస్, గంగా మరియు బ్రహ్మపుత్రానదీ లోయలో నివసించేవి. అస్సాంలోని కజీరంగా నేషనల్ పార్కులో ఇప్పుడు దాదాపు 1800 రైనోలు ఉన్నాయి.

ఆఫ్రికన్ నల్ల రైనో మరియు ఆఫ్రికన్ తెల్ల రైనోలకు రెండేసి పెద్ద పెద్ద కొమ్ములుంటాయి. ఇండియన్ రైనోలలాగ శరీరం ముడతలు పడి ఉండదు నల్ల రైనోలు ఒంటరిగా జీవిస్తాయి. తెల్ల రైనోలు మందలు మందలుగా జీవిస్తాయి. తెల్ల రైనోలు నిజంగా బూడిద వర్ణంలో ఉంటాయి. వీటికి తల పొడవుగా ఉంటుంది. మూతి వెడల్పుగా ఉంటుంది. ఆఫ్రికన్ రైనోలు పల్లపు మైదానాలలో నివసిస్తాయి. ఇండియన్ రైనోలు 12 అడుగులు ఎత్తుగా బాగా పెరిగిన గడ్డి మైదానాలలో నివసిస్తాయి.

ఈ అయిదు రైనో జాతులలోను ఇండియన్ రైనోలు మాత్రమే నీటిలో బాగా ఈదగలవు. నీటిలో పొర్లుతూంటాయి. రైనో దూడలు చాలా చురుకుగా ఉంటాయి. సాధారణంగా ఇవి పుట్టడానికి 16 మాసాలు అవుతుంది తన దూడని తల్లి రైనో మూడు నాలుగు ఏళ్ళు పెంచుతుంది. ఇండియన్ రైనోలకు ముందు కాళ్ళకు పెద్ద పెద్ద గ్రంథులు వ్రేలాడుతూ ఉంటాయి.

రైనోలు శాఖాహారులు. ఇది గడ్డి, ఆకులు, పళ్ళు, చిన్న చిన్న పొదలు, నీటిమొక్కలు, పంట మొక్కలు మొదలయిన వాటిని తింటాయి. ఇవి కొమ్ములతో భూమిని త్రవ్వి దుంపలను వ్రేళ్ళను తింటాయి. ఇన్ని సౌకర్యాలతో ఇంత శరీరం ఉన్నా వీటికి దృష్టి చాలా మందంగా ఉంటుంది. కానీ వీటికి శ్రవణశక్తి, ఘ్రాణశక్తి మిక్కిలి అధికం.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## నీవే దానికి కారణం అని అనుకుంటారు



సుప్రసిద్ధ బ్రిటిషు నాటకకర్త జార్జి బెర్నార్డ్‌షా బక్కచిక్కిన ఎముకలపోగు, విడుపాటి ముఖం. సుప్రసిద్ధ బ్రిటిషు సినీమా డైరక్టరు ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ దీనికి వ్యతిరేకం. బాగా బొద్దుగా లావుగా ఉండేవాడు.

ఇతడు ఒకసారి బెర్నార్డ్‌షాతో "నిన్నెవరైనా చూస్తే ఇంగ్లండులో కరువు వచ్చిందనుకుంటారు" అన్నాడు వెంటనే బెర్నార్డ్‌షా "ఔను! నిన్ను చూస్తే దానికి కారణం నీవే అనుకుంటారు" అని బదులిచ్చాడు

# సూపర్ కండక్టివిటీ

కునియో సుగియామా

కొత్త సూపర్ కండక్టివ్ వస్తువుల అభివృద్ధి ప్రపంచంలో నేడు ఒక ముఖ్య పరిశోధన. ఇది వర్తమాన శతాబ్దంలో నవ్య సాంకేతిక సంకల్పం. సాంఘికంగా ట్రాన్సిస్టరు సాధనాలకంటే వీటికి మిక్కిలి అధిక ప్రభావం వినియోగం ఉంటుంది.

1911 వ సం.లో హెచ్. కామర్‌లింగ్ ఒన్నెస్ (H. Kamerlingh Onnes) అనే డచ్ వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు ఘనీభవించిన పాదరసంలో విద్యుత్‌ను ప్రవహింపజేసినప్పుడు విద్యుత్ నిరోధకత పూర్తిగా తగ్గిపోతుందని తెలుసుకున్నాడు దీనినే సూపర్ కండక్టివిటీ అంటారు. అంటే అతి తక్కువ ఉష్ణోగ్రత దగ్గర కొన్ని వస్తువుల దోష రహిత విద్యుద్వాహకత. ఒన్నెస్ సహజ వాయువులో లభించే హీలియం ఉష్ణోగ్రతను బాగుగా తగ్గించి —268.9°C వద్ద ద్రవ రూపంగా మార్చగలిగాడు. పాదరసాన్ని ఈ హీలియం ద్రవంలో ఘనీభవింపజేసాడు. ఈ విధంగా ఘనీభవింపజేసిన పాదరసంలో విద్యుత్ నిరోధకశక్తి మాయమైనట్లు గుర్తించగలిగాడు.

సూపర్ కండక్టివ్ వస్తువుల గుండా విద్యుత్‌శక్తి ఉష్ణశక్తిగా మారకుండా అవిచ్ఛిన్నముగా ప్రవహించగలదు ఇటువంటి సూపర్ కండక్టివ్ వస్తువులతో తయారైన ట్రాన్స్‌మిషన్‌లైన్స్ ద్వారా పంపబడినప్పుడు విద్యుత్‌శక్తి వృధా కాదు.

కాయిల్ (Coil) కి సూపర్ కండక్టివ్ తీగలను చుట్టి సూపర్‌పవర్ ఎలక్ట్రోమాగ్నెట్స్ తయారుచేయవచ్చు దీని ఫలితంగా కలలు కంటున్న "పెర్మనెంట్ ఇంజన్"ని కూడా అభివృద్ధి చేయవచ్చు.

ఘనీభవించిన పాదరసాన్ని ఎలక్ట్రిక్ తీగలుగా ఉపయోగించలేరు. కాబట్టి ప్రపంచంలో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు తీవ్ర ప్రయత్నాలు కొనసాగించి అధిక ఉష్ణోగ్రత దగ్గర సూపర్‌కండక్టివిటీని పొందగల వస్తువుల అభివృద్ధికి పూనుకున్నారు. దీని ఫలితంగా నోబియం (Nobium) మరియు టిన్ (తగరము) మిశ్రలోహం —255°C వద్ద సూపర్ కండక్టివిటీని పొందగలదని కనుగొనబడింది. తరువాత 1973 వ సం.లో నోబియం మరియు జెర్మేనియం మిశ్రలోహము — 250°C వద్ద విద్యుత్ నిరోధక శక్తిపోతుందని కను

## సామర్థ్యత అంటే?



శ్రద్ధ, అభ్యుదయేచ్ఛ, అభిలాష, సమయ పాలన, ఖచ్చితమైన పనితనం, ఏ పనినైనా అత్యుత్తమరీతిలో నెరవేర్చాలనే కోరిక ఉండటం సామర్థ్యత అనిపించుకుంటుంది. పనిలో విశిష్టత పెరిగిన కొద్దీ ఫలితం పెరుగుతుంటుంది. —ఎమ్. విశ్వేశ్వ

'చేసిన అప్పు తీర్చలేని వానికి అప్పు ఇచ్చువాడు లోక బాంధవుడు. తిరిగి అడిగినవాడు యముడు.'

గొన్నారు. 5° డిగ్రీల పెరుగుదల విజ్ఞాన శాస్త్రరీత్యా ఒక అపూర్వ సాధన.

లాంథానమ్ (Lanthanum) మరియు బేరియం (barium) ఆక్సైడ్‌తో తయారు చేసిన పింగాణీ —243°C వద్ద విద్యుత్ నిరోధకశక్తి పూర్తిగా పోతుందని. ఇంటర్ నేషనల్ బిజినెస్ మెషీన్స్ కార్పొరేషన్ వారి జ్యూరిచ్ పరిశోధక సంస్థలో డా. జె.జి. బెడ్‌నోర్జ్ అధ్వర్యంలో ఒక బృందం స్థానిక వైజ్ఞానిక పత్రికలో ఏప్రిల్ 1986 లో ప్రకటించింది 13 సంవత్సరాలలో ఇది 7°C పెరుగుదలను సూచిస్తుంది

టోకియో యూనివర్శిటీ — టెక్నాలజీ డిపార్ట్‌మెంట్‌కు చెందిన ప్రొ. షోజీ టనాకా దీనిని అనుసరించి అటువంటి వస్తువులను ఉపయోగించి ప్రయోగాలు చేసారు. ఇతడు 1986 వ సం రం. నవంబరు 22 వ తేదీన —243°C వద్ద సూపర్ కండక్టివిటీ సాధించినట్టు ధృవపరచాడు. దీంతో వైజ్ఞానిక ఉత్సాహం మరింత చైతన్యత పొంది ఇంకా అధిక ఉష్ణోగ్రతవద్ద సూపర్ కండక్టివిటీ సాధించడానికి ప్రయత్నాలు కొనసాగించారు.

1987 ఫిబ్రవరిలో యునైటెడ్ స్టేట్స్ హూస్టన్ యూనివర్శిటీ పరిశోధకుడు —175°C వద్ద సూపర్ కండక్టివిటీని సాధించగల వస్తువును కనుగొన్నాడు పూర్వం సూపర్ కండక్టివిటీ వస్తువులు —268.9°C వద్ద హీలియం ద్రవంలో శీతలీకరణం చేయవలసి వచ్చింది. కాని ఇప్పుడు —196°C వద్ద నత్రజని ద్రవంలో ఇది సాధ్యమైంది. నత్రజని గాలిలో విస్తారంగా లభిస్తుంది కాబట్టి ఖర్చు తక్కువ.

తరువాత ఇటీవల శాస్త్రజ్ఞులు — 40°C వద్ద (రెఫ్రిజిరేటర్ల ఉష్ణోగ్రత) సూపర్ కండక్టివ్ చెందగల వస్తువులను ప్రవృద్ధి చేసారు. — 40°C రిఫ్రిజిరేటర్ ఉష్ణోగ్రత ఫ్రియాన్ వాయువు (Freon gas సహాయంతో పొందగలరు ఇప్పుడు గది ఉష్ణోగ్రత దగ్గరే సూపర్ కండక్టివిటీ చెందగల వస్తువును కనుగొనడానికి తీవ్రపరిశోధనలు సాగుతున్నాయి.

ఇటువంటి సూపర్ కండక్టివ్ వస్తువుల ద్వారా పంపినప్పుడు విద్యుత్‌శక్తి వృధా కాదు. ఇంతేగాక ఎలక్ట్రిసిటీ స్టోరేజీకి, లీనియర్ మోటారుకారుకి, న్యూక్లియర్ ఫ్యూషన్‌కి, సూపర్‌స్పీడ్ కంప్యూటర్‌కి, న్యూక్లియర్ మాగ్నటిక్ రెసొనెన్స్ డయాగ్నసిస్‌కి ఇది ఉపయోగపడుతుంది. 20 వ శతాబ్దం (Big five) బిగ్‌ఫైవ్ (బృహత్ పంచకం) సాంకేతిక నవ్య కల్ప

(మిగతా 14 వ పేజీలో)

## అదిక వ్యయంతో కూడిన విలాసం - చింత



మనోవ్యధతో యాతనపడిపోయే వాళ్ళు చాలా త్వరగా మరణిస్తారు. వివేకవంతుడై జ్ఞాని నిశ్చింతగా జీవించగలుగుతాడు విశ్వాసం గలవాడు అంతా తన అన్నట్టు జీవించగలుగుతాడు.

— థామస్ డ్రైయర్.

# ప్రాచీన శిలాజవిధానం

అనిలారావు

సస్యసంబంధ లేక వృక్షసంబంధ శిలాజం నుంచి ప్రపంచంలో ఈ సస్య మరియు వృక్షపరిణామ అధ్యయనం పాలియోబాటనీ అంటారు. 'పాలియో' అంటే ప్రాచీన, బోటనీ' అంటే వృక్షశాస్త్రం.



భారతదేశంలో మొట్టమొదట క్రమ పద్ధతిలో వృక్షశిలాజపరిశోధన జరపాలని ప్రొ. బీర్బల్ సాహ్నీ 1929 వ సంవత్సరంలో ఒక పథకం వేశాడు. ఇతడు ప్రసిద్ధి పొందిన వృక్షశిలాజ పరిశోధకుడు. ఇతడి కృషి 1949 లో ఫలించింది. ప్రొ. సాహ్నీ డైరెక్టర్‌గా పాలియోబాటనీ ఇన్‌స్టిట్యూట్ లక్నోలో స్థాపించబడింది. అదే సంవత్సరంలో ఈ సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుని గౌరవించడానికి ఇన్‌స్టిట్యూట్‌కి బీర్బల్ సాహ్నీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాలియోబోటనీ అని పేరు పెట్టారు.

ప్రాచీన వృక్షశాస్త్ర పరిశోధనలో ముఖ్యంగా వృక్షశాస్త్రానికి మరియు భూగర్భ శాస్త్రానికి సంబంధించిన విషయాలు గ్రహించబడతాయి. వివిధ పురాశిల్ప వస్తువుల త్రవ్వకాలలో లభించిన ధాన్యపు శిలాజము సహాయంతో పాలియో బోటనీలో ఒక విభాగమైన ఆర్కియో బోటనీ పరిశోధన చేయబడుతుంది. ప్రాచీన కాలంలో వివిధ ఆహారపు అలవాట్లకు అనుగుణ్యంగా ఏ ఏ పంటలు ఏ విధంగా పండింపబడేవో తెలుసుకుంటారు. పరిశోధన ప్రాతిపదికగా ఈ సంస్థ కొన్ని ముఖ్య ధాన్యాల పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకోగలిగింది.

ఉత్తరప్రదేశ్ అలహాబాద్ సమీపంలో కోలినా అనే ప్రదేశం చుట్టుపట్ల త్రవ్వకాలలో లభించిన 6500 బి.సి. నాటి ధాన్యపు శిలాజాలు మిక్కిలి ప్రాచీనమైనవి. వీటివల్ల భారతదేశంలో వరి ప్రాచీనకాలం నుంచే పండింపబడేదని తెలుసుకోబడింది. అదే విధంగా శిలాజమువల్ల 'రాగులు' భారత దేశానికి చెందినవి అని తెలుస్తుంది.

('సిఇఇ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో)

## ప్రపంచంలో ఎయిడ్స్ రోగులు

అక్టోబరు 30, 1987 నాటికి ప్రపంచంలో 62,784 ఎయిడ్ (Aids) రోగులున్నారని ప్రపంచ ఆరోగ్యసంస్థ వారి

# అల్పులను లక్ష్యపెట్టకు

స్వామిని శారదాప్రియానంద

పూర్వం ఒక రాజుగారి ఉద్యానవనంలో ఒక చిలుక గూడు నిర్మించుకుని సుఖంగా కాపురం చేస్తూండేది. ఆ చిలుక బాగా మాట్లాడుతుంది.

ఒకరోజు ఆ చిలుకకు ఒక ముత్యం దొరికింది ఆ ముత్యాన్ని ముక్కున కరచు





కొని ఎగిరి వెళ్ళి గూట్లో పెట్టుకుంది. చిలుక సంతోషంతో మురిసిపోతూ "నా కో ముత్యం దొరికింది", "నాకో ముత్యం దొరికింది" అని కేరింతలు పెడుతూ రెక్కలు కొట్టుకుంటూంది; నృత్యం చేస్తూంది. రాజభవనంలో అందరూ దాన్ని చూచి నవ్వుకున్నారు. ఎన్నో రోజులు గడిచిపోయింది. అయినా ఆ చిలుక అరవడం మానలేదు … రాజుగారి పడకగదిలో దూరి మరింత గట్టిగా 'నాకో ముత్యం దొరికింది, నాకో ముత్యం దొరికింది అని మరింత బిగ్గరగా అరవడం ప్రారంభించింది.

పగలనక, రాత్రనక నిరంతరం రాజుగారు మేలుకున్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడు కూడా చిలుక అరవడం ప్రారంభించింది. రాజుకు విసుగు వచ్చింది. సేవకులను పిలిచాడు. సంగతి చెప్పి చిలుక గూట్లోంచి ముత్యాన్ని తీసివేయమన్నాడు. చిలుక అరవటం మానేస్తుంది అనుకున్నాడు.

సేవకులు ఉద్యానవనంలో చిలుక గూడు వెతికి అందులో ఉన్న ముత్యాన్ని తీసివేసారు. చిలుక ఇది గ్రహించి అటూ ఇటూ

## బహుముఖోపయోగకరమైన జిగురు

సోవియెట్ యూనియన్ మాస్కోలో పరిశోధకులు ఎటువంటి జిగురునైనా బహుముఖంగా ఉపయోగపడే జిగురుగా మార్చగల క్రొత్తవిధానాన్ని కనుగొన్నారు. గాజు, ప్లాస్టిక్, కొయ్య, కాగితము, తోలు, సజీవ కణాలు మొదలైన వివిధ వస్తువులను అమోఘంగా దీనితో అతికించవచ్చు. వీరు సాలెగూళ్ళను పరిశోధించి ఈ రహస్యాన్ని కనుగొన్నారు.

ఎగురుతూ "రాజు ఎంత దరిద్రుడో, నా ముత్యం ఎత్తుకుపోయాడు; దుష్టరాజు నా ముత్యం ఎత్తుకుపోయాడు" అని అరవడం ప్రారంభించింది. రాజుని అనరాని మాటలు అని తిట్టడం ప్రారంభించింది. ఇది విన్న ప్రజలు నిజమే అయి ఉండాలి అనుకున్నారు.

కాలం గడిచిపోయింది. చిలుక ఇంకా అరవడం మానలేదు. చిలుక తిరిగి తిరిగి అరుస్తూండటంవల్ల రాజుకి నిద్ర పట్టడం లేదు. రాజుగారికి విసుగుపుట్టి కోపంతో ముత్యాన్ని తీసిపారేస్తే కొంతవరకయినా ప్రమాదం తగ్గుతుందని ఊహించి ముత్యాన్ని పారవేయండని సేవకులకు ఆజ్ఞాపించాడు. సేవకులు వెంటనే ఆ ముత్యాన్ని పార వేశారు. చిలుక అమాంతం ఎగిరి ముక్కుతో ముత్యాన్ని పట్టుకుని రివ్వున ఎగిరిపోయింది.

ముత్యాన్ని తీసికెళ్ళి తిరిగి గూట్లో పెట్టు కుంది. మళ్ళా క్రొత్తగా కేకలు వేయడం ప్రారంభించింది. "పిరికిపంద రాజు, భయ పడి నా ముత్యం నాకిచ్చేశాడు. రాజుకి ఎంత భయమో!" అని అరవడం ప్రారంభించింది. ఎవ్వరూ ఆ చిలుక నోరు మూయ లేకపోయారు. చిలుక అలా అరుస్తూనే ఉంది. వెంటనే రాజు తన తప్పును తెలుసుకున్నాడు. "మొట్టమొదట చిలుక అరచినప్పుడే అసలు లక్ష్యపెట్టకుండా -ఉండవలసింది" అను కున్నాడు.

ఇక మీదట చిలుక ఎంత అరచినా లక్ష్య పెట్టకూడదని నిశ్చయించుకున్నాడు. చిలుక కొన్ని రోజులు అరిచి అరిచి చివరికి ఎవరూ తనని లక్ష్యం చేయడం లేదని తెలుసుకుని అరవడం మానేసింది.

## రక్తహీనతకు క్రొత్త ఔషధం

రక్తహీనతకు 'ఇరిత్రోగమ్' (Erythrogum) అనే క్రొత్త ఔషధం ఒకటి అంతరిక్షంలో తయారు కాబడింది. అభివృద్ధి పొందుతూన్న దేశాలలో మిలియనుల కొద్దీ రక్తహీనతతో బాధపడే స్త్రీలకు, పిల్లలకు ఈ ఔషధం నివారణ కలిగిస్తుంది.

## సాలీనా 1.67 మిలియను ఇళ్లు నిర్మిస్తున్నారు



భారతదేశంలో పెరుగుతూన్న జనాభాకి ప్రతిసంవత్సరం 2 మిలియను ఇళ్ళు అవ సరముంటుంది. కానీ ప్రతీ సంవత్సరం 1.67 మిలియను ఇళ్ళు మాత్రమే నిర్మించ గలుగుతున్నారు. 1.07 మిలియను ఇళ్ళు గ్రామీణ ప్రాంతాలలోను, 0.60 మిలియను ఇళ్ళు పట్టణవాసాలలోను ఏర్పాటు చేస్తు న్నారు. వసతిసౌకర్యాలు లేకపోవడంవల్ల, ఆహారసదుపాయాలు లేకపోవడంవల్ల, ఉద్యో గావకాశాలు లేకపోవడంవల్ల చాలామంది పెద్ద పెద్ద నగరాలకు వలసలు పోతున్నారు.

"ప్రజా ధనమే ఆహారము భగవతి స్వరూపము"

# అభ్యాసము - అలవాటు

నడవడం, మాటలాడటం, సైకిల్ తొక్కడం, ఏదైనా ఒకపని చెయ్యడం మొదలైనవి ఎన్నెన్నో అభ్యాసాలు మన నిత్య జీవితంలో అలవాట్లుగా ఉంటాయి. అభ్యాసానికి, నేర్చుకోవడానికి చాలా దగ్గర సంబంధం ఉంది. ఒక చిన్న పాపాయి బుజ్జులు నడక నేర్చుకుంటుంది. ప్రయత్నం చేసి మెల్లిగా కాలుఎత్తి ఒక అడుగు ముందు పెట్టి శ్రమపడుతుంది. పడిపోకుండా జాగ్రత్త పడుతుంది. క్రమ క్రమంగా ఇలా ప్రయత్నం చేయగా శ్రమ జాగ్రత్త తగ్గుతాయి. సులభంగా నడవడం ప్రారంభిస్తుంది. బుజ్జులికి నడవడం అభ్యాసమైపోతుంది. ఈ విధంగా ఒక పని ఒకే రీతిగా చేస్తూ చివరికి ఇతరుల సహాయం, చేయూత లేకుండా తనంతట తానే చేసే ప్రవృత్తి అభ్యాసము. ఇటువంటి అభ్యాసం మానసికంగా ఉండవచ్చు. దైహికంగా ఉండవచ్చు.

ఒక పాత అభ్యాసం తప్పించుకుని మరో క్రొత్త అభ్యాసం చేసుకోడానికి దృఢ సంకల్పం ఉండాలి. ఓపిక, పట్టుదల ఉండాలి. తరువాత, రేపు అనే వాయిదా పద్ధతి ఉండకూడదు. అలస్యం లేకుండా ఎప్పటికప్పుడు చేయాలి. కార్యదీక్ష వహించాలి. తీవ్ర ప్రయత్నం చేస్తే చెడ్డ అలవాట్లను, దురభ్యాసాలను మార్చుకోవచ్చు. మంచి అభ్యాసాల వల్ల ఉపయుక్తమైన సత్కర్మలకు కావలసిన కాలం, సమయం, సామర్థ్యం ఎక్కువ చేసుకోవచ్చు.

అభ్యాసంవల్ల కొందరి ప్రవర్తనే పూర్తిగా మారిపోతుంది. ఉత్తేజం కలిగించే వస్తువులు,

## సామర్థ్యం, సౌందర్యం పెరగాలంటే



మన ఆహారం దానం చేస్తే మన బలం
మరింత పెరుగుతుంది
వస్త్రదానంవల్ల మన సౌందర్యం మరింత
పెరుగుతుంది.
పవిత్రత వల్ల, సత్యసంధత వల్ల మన
సౌభాగ్యం మరింత పెరుగుతుంది.

---

(10 వ పేజీ తరువాయి)

నలలో సూపర్ కండక్టివిటీ వస్తువు ఒకటి. మిగిలిన నాలుగు ఎటామిక్ ఎనర్జీ, ప్లాస్టిక్ మరియు ఇతర సింథటిక్ రసాయన వస్తువులు, ట్రాన్సిస్టర్లు మరియు లేసర్. ఇవి పరిశ్రమ రంగంలో అద్భుతమైన మార్పులు తీసుకురాగలవు.

'పసిఫిక్ ఫ్రెండ్' సౌజన్యంతో

"సంసారబద్ధుడు తనకన్న పద్మానంతుని చూచినచో [illegible] కాదు, [illegible] దేవీ[illegible] సమానుని నిరసనం చేసాడు."

మత్తుకలిగించే వస్తువులు సేవించడం అలవాటు ప్రారంభమైతే తిరిగి వాటిని విడవడం సులభసాధ్యంకాదు.

సిగరెట్లలో ఉండే నికొటిన్ అనే పదార్థం కొద్దిగా మత్తుకలిగిస్తుంది. పొగ తోటల పెంపకం ప్రాచీన కాలంనుంచే ఉన్నా దాంతో తయారయే సిగరెట్లకు నేడు చాలా ప్రసిద్ధి వచ్చింది. దాని వ్యామోహం ఎక్కువైంది. సిగరెట్లు కాల్చడంవల్ల ఊపిరితిత్తులు చెడిపోతాయి. హృదయరోగాలు, కాన్సరురోగాలు సంభవిస్తాయి. లెసర్జిక్ అమ్లడైఈథైలమైడ్ (LSD) ఔషధం మిల్లీగ్రాంలో వెయ్యోవంతు సేవిస్తే మానసిక విభ్రమ కలుగుతుంది. మద్యం, వైన్, బీరు మొదలైనవి త్రాగడంవల్ల తాత్కాలికంగా మనస్సు తేలిక అనిపించినా దానివల్ల సంభవించే పరిణామం చాలా భయంకరంగా ఉంటుంది కొకైన్, మార్ఫియా, మారిజువానా; హాశిష్, నల్లమందువల్ల నిద్రమత్తు వస్తుంది. వీటిని ఇంజక్షనులు ద్వారాగానీ, ముక్కుద్వారాగానీ సేవించి ఈ ప్రపంచం మరచిపోయి ఏదో ఉత్తమ స్థితిలో ఉన్నట్లు భావిస్తారు. ఈ మందులు అదేపనిగా సేవిస్తూంటే భయము. చింత బయలుదేరతాయి. మంకుతనము, నీరసం పట్టుకుంటాయి. కాలక్రమేణా ఆకలి, నిద్ర పూర్తిగా తగ్గి నిస్త్రాణతో మనస్సు దుర్బలమైపోతుంది.

మంచి అభ్యాసాలు ఏమిటి? చెడ్డ అలవాట్లు ఏమిటి? అని వివరంగా తెలుసుకుని ప్రవర్తించడంలోనే వ్యక్తి భవిష్యత్తు ఉంటుంది.

## మహోన్నత జీవితానికి అధికార పత్రం




సోక్రటీస్ గ్రీసుదేశపు సుప్రసిద్ధ తాత్త్వికుడు. విషం తాగించి చంపబడాలని ఇతడికి మరణదండన విధింపబడింది. నిర్భయంగా చెరసాలలో ఎదురు చూస్తున్నాడు.

నిర్ణయింపబడిన రోజున విషం త్రాగడానికి ముందు తన ప్రియశిష్యుడైన క్రిటో (Crito)ను పిలిచి 'ఈ విషపుగిన్నె' మహోన్నత జీవితానికి అధికార పత్రం సుమా!" అన్నాడు.

విషపుగిన్నె సిద్ధంగా ఉంది. దీనిని సోక్రటీస్‌కి ఇచ్చారు. అది చేతులలో పెట్టుకుని భగవంతుని ప్రార్థించి క్రిటోతో "ధైర్యంగా ఉండు. నీవు సోక్రటీస్ భౌతిక కాయాన్ని పాతిపెడుతున్నావు. నిశ్చింతగా ఉండు. సహనం వహించు" అని చెప్పి విషాన్ని గడగడ త్రాగి భగవంతుని ప్రార్థిస్తూ చెరసాల గదిలో పడుకుని మెల్లమెల్లగా స్వర్గాన్ని చేరుకున్నాడు. అక్కడే ఒక దివ్యతారగా ప్రకాశిస్తున్నాడు.

—'బాల్ వికాస్' సౌజన్యంతో

ఎవరి తప్పులు వారు తెలుసుకుని సరిదిద్దుకోవడం అందరికీ తెలియదు.

# గినీవర్మ్

షైలజ ఎస్. పరీఖ్

గ్గినీవర్మ్ క్రొత్తదికాదు. ఇది అతి ప్రాచీన కాలంనుంచీ మానవులను పట్టి పీడిస్తూ ఉంది. ఇది సుమారు 100 సెంటీమీటర్ల పొడవు ఉంటుంది. త్రాగే మంచినీరు గినీవర్మ్ లార్వా (అప్పుడే గ్రుడ్డునుంచి వెలువడ్డ క్రిములు) తో కాలుష్యం అయినప్పుడు ఇది అంటురోగంగా పరిణమిస్తుంది. ఇటువంటి కలుషితమైన నీరు త్రాగినప్పుడు ఇవి మానవ శరీరంలో చేరి అక్కడ ప్రవృద్ధి పొందుతాయి. సాధారణంగా మానవ శరీరంలో క్రిందిభాగం నీటికి తగిలే పాదాల దగ్గర పొడుచుకువస్తాయి. కాలిమీద పుళ్ళు ఏర్పడి దురదపెట్టి రసి కారుతుంది.

గినీవర్మ్ అంటువ్యాధి. ఆడ గినీవర్మ్ పురుగు మిలియనులకొద్దీ గ్రుడ్లను నీటిలోకి వదులుతుంది. నీటిలో ఉండే సైక్లాప్స్ వీటిని తింటాయి ఈ గ్రుడ్లు సైక్లాప్స్‌లో పెరుగుతాయి. ఇటువంటి సైక్లాప్స్‌తో కాలుష్యమైన నీటిని ఎవరైనా త్రాగినప్పుడు గినీవర్మ్ లార్వా వారి శరీరంలో చేరుతుంది.

క్రిమి బైటకు రాకముందు రోగికి శరీరం మీద పెద్ద పెద్ద బొబ్బలు ఏర్పడి జ్వరం వస్తుంది. కడుపులో త్రిప్పు వాంతి విరేచనాలు పట్టుకుంటాయి. ఉబ్బసం, దగ్గు వస్తుంది. మూర్ఛపడిపోతారు. టిటానస్ వంటి రోగం కూడా దీనివల్ల సంభవించవచ్చు. దీర్ఘకాలం పట్టి పీడించే రోగం ఇది. దీనివల్ల మాన్ అవర్లు నష్టమైపోతాయి. ఎంతో పనికి నష్టం కలుగుతుంది.

జీవితకాలంలో గినీవర్మ్ 50 మొదలు 100 సార్లు అంటుకోవచ్చు. అప్పుడప్పుడు గినీవర్మ్ కీళ్ళదగ్గర పట్టి రోగి లేవలేక పోతాడు. 5 శాతం మందికి ఈ రోగం సంభవిస్తుంది.

ఇది అంటుకుని ప్రవృద్ధిపొందే విధానం తెలుసు కాబట్టి దీనిని సులభంగా నిరోధించవచ్చు. నిరోధక చర్యలేతప్ప వేరే గినీవర్మ్‌కి చికిత్సా విధానం ఇంతవరకు కనిపెట్టలేదు. పరిశుభ్రమైన నీటిని సరఫరా చేయటంవల్ల మాత్రమే ఈ రోగం తగ్గదు. వ్యక్తిగతమైన అలవాట్లు, మూఢ ఆచారాలు మానుకోవాలి. గ్రామాలలో ప్రజలు నీటిని శుభ్రపరచడం ద్వారా, ఆరోగ్యవంతమైన వాతావరణం కలిగించడం ద్వారా, నీటివల్ల కలిగే అంటు రోగాలు వాటి రక్షణ గురించి తెలియబరచుట ద్వారా దీనిని నివారించవచ్చు.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## సామర్థ్యతకు వైరాగ్యమే ముఖ్యం



రాజకీయవేత్తలు మంచి రాజపాలకులు కావాలి. నేటి భారతదేశపు క్లిష్టపరిస్థితులలో ప్రభుత్వాన్ని సక్రమంగా కొనసాగించాలంటే మమకారంలేని ఉదాసీనభావం వహించాలి. రాజకీయ జీవితంలోనైనా, సాంసారిక జీవితంలోనైనా ఒకే సూత్రం. సామర్థ్యతకు వైరాగ్యం ముఖ్యం.

# ఉల్లి చేసే మేలు

రాఘవేంద్రరావు

ప్రపంచంలో మిక్కిలి ప్రాచీన కాలంనుంచీ సాగుచేయబడుచున్న గడ్డ జాతికి చెందిన కూరలలో ఉల్లి ముఖ్యమైనది. వాణిజ్యరీత్యా, ఆహారరీత్యా ఇది చాలా ప్రసిద్ధి పొందింది. దీని ఆదిమస్థానము మధ్య ఆసియా



ప్రాంతము. చరిత్ర ఏర్పడడానికి ఎంతో కాలం ముందే ఇండియా, చైనా, ఈజిప్టు ప్రజలకు దీనిని గురించి తెలుసు. లిల్లీ కుటుంబానికి చెందిన గోళాకారంగా ఉండే ఉల్లిగడ్డను ఈజిప్షియనులు విశ్వానికి సంకేతంగా భావించేవారు.

ఇది సంవత్సరానికి రెండుసార్లు పండుతుంది. దీనిలో విటమిను 'డి, విటమిను 'సి' కొంతవరకు ఇనుము, కాల్షియం ఉన్నాయి. దీంట్లో ఘాటు 'అలైల్ ప్రోపిల్ డైసల్ఫైడ్' అనే రసాయనిక పదార్థంవల్ల కలుగుతుంది.

వృక్షశాస్త్రజ్ఞులు దీనిని అల్లియంసెపా (Allium Cepa) అంటారు. కాని ఇంగ్లీషులో దీనికి ఆనియన్ అనే పదం లాటిన్ యునస్ (unus) అనేపదం నుంచి వచ్చింది. రోమనులు దీనిని ఇంగ్లండులో ప్రవేశపెట్టే దాకా దీనిని గురించి బ్రిటిషువారికి తెలియదు. రెడ్ ఇండియనులు ఘాటైన ఉల్లిపాయలను పులుసులో ఉపయోగిస్తూండటంచేత అమెరికనులకు దీనిని గురించి తెలుసు.

ఆకారము, రంగు, పరిమాణము, ఘాటు, కారము మొదలైన విషయాలను ఆధారం చేసుకొని ఇవి వివిధ రకాలు ఉంటాయి తెలుపు, పసుపు, ఎరుపు ఆకుపచ్చరంగులు గల ఉల్లిపాయలు ఉన్నాయి. బెర్ముడాలో పండే ఉల్లిపాయలు మిక్కిలి పెద్దవి. బల్లపరపుగా ఉంటాయి. అంత ఘాటుగా ఉండవు సౌమ్యంగా ఇటలీ

ఉంటాయి. స్పానిష్ ఉల్లిపాయలు చాలా రుచిగా పెద్దవిగా ఎక్కువ రసంతో ఉంటాయి సాధారణంగా మనదేశంలో పెద్ద గడ్డలు 5 మొదలు 10 సెం.మీ. వ్యాసం ఉంటాయి చిన్నవి 1 మొదలు 3 సెం.మీ. వ్యాసంలో ఉంటాయి. చిన్నవి గుత్తులు గుత్తులుగా ఉంటాయి. ఎర్ర రంగు ఉల్లిపాయలు చాలా రోజులు నిల్వ ఉంటాయి. మార్కెట్ గార్డెనర్, ప్రైజ్ టేకర్, క్వీన్, ఎల్లో గ్లోబ్ మొదలైనవి చిన్న గడ్డలు.

**140 అ**

ఫ్రెంచి

ద్వీపం .

మొట్టమొదట స్పానియార్డ్స్ దీనిని కను గొన్న వెంటనే వెస్ట్ ఇండీస్‌లో ప్రవేశ పెట్టారు. అక్కడనుంచి ఇది అనేక అమెరికా దేశాలకు ప్రాకిపోయింది.

అనేక వంటకాలలో రుచి, కమ్మదనం అధికపరచడానికి ఉల్లిపాయలను మించిన వస్తువు మరొకటి లేదు. ఉడకబెట్టుకుని స్ట్యూ (Stew), వేపుళ్ళు, కూరలు. సాలడ్స్‌లో వాడటం కాకుండా కొన్ని దేశాలలో దీనితో ప్రత్యేకంగా కూర చేసుకుంటారు.

దీంట్లో గంధికం ఎక్కువగా ఉంటుంది. అందువల్లే దీనిని తరిగేటప్పుడు కళ్ళు మండి నీళ్ళు కారతాయి. ఉల్లిపాయలను నీళ్ళలో తరిగితే కళ్ళనుండి నీళ్ళు కారవు. ఉల్లిపాయ కమ్మదనం రుచేకాదు, దీనిని మించిన వైద్యుడు లేడనే చెప్పాలి. చేతికి అనువుగా ఎప్పుడూ ఇంట్లో ఉంటుంది. ప్రాచీన భారత దేశంలోనే కాకుండా చైనాలో, ఈజిప్టులో దీనిని జలుబులకు, చెవిపోటుకు, తేలు కాటుకు ఔషధంగా వాడేవారు.

దీంట్లో పోషక పదార్థాలు అంత ఎక్కువగా లేకపోయినా వాణిజ్యరీత్యా చాలా ముఖ్యమైనది. ఎండిన వాటికి కూడా మంచి గిరాకీ ఉంటుంది. ప్రపంచంలో ముఖ్యంగా ఇండియా, చైనా, యునైటెడ్ స్టేట్స్, సోవియట్ యూనియన్, జపాను, టర్కీ ఉల్లిని ఎక్కువగా పండిస్తారు.

పశ్చిమ దేశాలలో ఉల్లిపాయ అనేక విధాలుగా వినియోగింపబడుతూంది. ఉడక బెట్టి ఊరగాయలు తయారుచేసి డబ్బాలలో అమ్ముతారు. 'ప్రోవెన్స్' ఉల్లిపాయ లభిస్తుంది. సీసాలలో ఉల్లిరసం అమ్ముతారు. ఉల్లి పొడి కూడా దొరుకుతుంది. ఇది సామెతలలో కూడా చేరింది. 'ఉల్లి చేసే మేలు తల్లి కూడా చేయ'దంటారు. అంటే అనేక రోగాలను నివారిస్తుందని, తల్లి కూడా అంతమంచి చేయలేదని అర్థం. ఆంగ్లేయ భాషలో 'He knows his onion' అంటారు. అంటే తన పనిలో మంచి సిద్ధహస్తుడని, నిపుణుడని అర్థం. 'He is off his onion' అంటారు. అంటే వాడు పిచ్చి వాడని అర్థం.

కొంతమంది ఛాందసులు దీనిని తిన కూడదని చెపుతూ దానికి పవిత్రమైన లింగ కాయలని, సాలిగ్రామాలని పేరుపెట్టి తింటూంటారు. ఉల్లిపాయలు తినడంవల్ల కలిగే నోటి దుర్వాసన పార్స్లే (Parsley) నమలడం వల్లపోతుంది. పార్స్లే అనేది సహజమైన బ్రెత్ ఫ్రెషనర్ (Breath Freshner).

## భారత దేశంలో వంటచెరకు వినియోగం



భారతదేశంలో వంటచెరకు సంవత్సరానికి 133 మిలియను టన్నులు వినియోగం

## గల్ఫ్ ప్రాంత ప్రదేశాలలో 305 బిలియన్ పీపాల ముడి నూనె:

అరేబియన్ గల్ఫ్ ప్రదేశంలో బహ్రెయిన్, ఖ్వాటర్, సౌదీ అరేబియా, ఒమాన్, యుఎఇ మరియు కువెయిట్ దేశాలలో లభిస్తున్న సహజవాయువులు ప్రస్తుత వినియోగ ప్రమాణంతో ఇంకా 300 సంవత్సరాలదాకా సరిపోతుందని అంచనా వేయబడింది. గల్ఫ్ ప్రాంతాలలో 305 బిలియన్ పీపాల ముడి నూనె లభిస్తుంది. ఇది మొత్తం ప్రపంచపు నూనె వనరులలో 43 శాతం. ఒక్క సౌదీ అరేబియాలో 171.5 బిలియన్ పీపాల ముడి నూనె లభిస్తుంది.

* * *

## ప్రపంచంలో అతి వేగవంతమైన ట్రాన్సిస్టరు:

యుఎస్ఎ ఇల్లినోయిస్ యూనివర్శిటీలో ప్రవృద్ధిపరచబడిన ట్రాన్సిస్టర్ ప్రపంచంలో మిక్కిలి వేగవంతమైనది. ఈ క్రొత్త విద్యుత్ పరికరం ఉపగ్రహాలకు అతివేగంగా వార్తలు, ఇతర వివరాలు ప్రసారం చేయడానికి సహకరించి, అతితక్కువ స్థాయి రేడియో సిగ్నల్స్‌ను గ్రహిస్తుంది. భూగ్రహానికి అనేక కాంతి సంవత్సరాల దూరంలో ఉండే అంతరిక్ష నౌక నుండి వచ్చే సిగ్నల్స్‌ను ఇది గ్రహించగలదు.

## బంగారం నిల్వలు 35 టన్నులు పెరిగాయి:

1986వ సం. లో భారతదేశపు బంగారం నిల్వలు 35 టన్నులు పెరిగాయి. అన్ని దేశాలలో కంటే ఇది మిక్కిలి అధికమని బాస్లేలోని ఇంటర్నేషనల్ సెటిల్‌మెంట్స్ బాంక్ వార్షిక వివరణ పత్రంలో పేర్కొన్నారు. భారతదేశం తరువాత బంగారపు నిల్వలు ఫిలిప్పైన్ దీవులలో 24 టన్నులకు, తైవాన్‌లో 18 టన్నులకు, మెక్సికోలో 6.5 టన్నులకు పెరిగింది.

* * *

## 100 దేశాలలో మొత్తం 31,646 ఎయిడ్స్ రోగులు గుర్తించబడ్డారు:

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్‌వారి పరిశీలన ప్రకారం మొత్తం 100 దేశాలలో 31,646 ఎయిడ్స్ రోగులు గుర్తించబడ్డారు. ఉత్తర అమెరికా మరియు దక్షిణ అమెరికాలలోని 44 దేశాలలో 27,166 ఎయిడ్స్ కేసులు కనుగొనబడ్డాయి.

* * *

## అత్యధిక ప్రాసెసింగ్ స్పీడుతో సూపర్ కంప్యూటర్:

జపాన్ హిటాచీ లిమిటెడ్ కంపెనీ ప్రపంచంలో అత్యధిక ప్రాసెసింగ్ స్పీడు

గల హిటాచీ S-820 అనే సూపర్ కంప్యూటర్‌ను ప్రవృద్ధిచేసింది. రెండు నమూనాల శ్రేణిలో మోడల్ 80 కి మిక్కిలి అధిక వేగం ఉంటుంది. సెకండుకి 3 బిలియను ఫ్లోటింగ్ పాయింట్లు ప్రాసెసింగ్ స్పీడు లేక మూడు గిగా ఫ్లాప్స శక్తి ఉంటుంది. ఈ శ్రేణిలో నమూనా 60 కి 1.5 గిగా ఫ్లాప్స శక్తి ఉంటుంది.

* * *

## ఫ్రాన్స్ నుండి పర్సనల్ రైటర్:

ఫ్రెంచి కంపెనీ కొత్తగా కనిపెట్టిన 'పర్సనల్ రైటర్' విధానంలో వ్రాయడానికి ఒక ఎలక్ట్రానిక్ పెన్, కాగితాన్ని పెట్టడానికి ప్రత్యేకమైన పలక కలిగి ఉంటుంది. ఇది కీ బోర్డు అవసరం లేకుండా చేతితో వ్రాయబడిన గ్రంథాలను పర్సనల్ కంప్యూటరు స్క్రీనుమీద టైపు చేస్తుంది.

* * *

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద హెవీ ఐయాన్ ఆక్సిలేటరు:

జపాన్‌లో టోకియోలోని వాకో నగరం దగ్గర ఫిజికల్ అండ్ కెమికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో 'రింగ్ సైక్లోట్రాన్' పూర్తి చేయబడింది. ఇదే ప్రపంచంలో మిక్కిలి పెద్ద హెవీ ఐయాన్ ఆక్సిలేటర్. 1980 వ సం. నుంచీ నిర్మింపబడుతున్న దీనికి 13,700 మిలియను యెన్‌లు ఖర్చు చేశారు. ఈ సైక్లోట్రాన్ 13 మీటర్ల వ్యాసం, 8 మీటర్ల ఎత్తు ఉంటుంది. ఇది కాంతిపుంజ వేగాన్ని త్వరితపరుస్తుంది.

*

## ఆస్పిరిన్‌కు గుండెపోటు ప్రమాదాలను తగ్గించే అవకాశం:

అమెరికాలో హాస్పిటల్లో 1,300 మంది రోగులమీద ప్రయోగించి రోజుకి ఒక ఆస్పిరిన్ మాత్ర తీసుకుంటే గుండెపోటువల్ల కలిగే ప్రమాదాలు తగ్గుతాయని శాస్త్రజ్ఞులు సూచిస్తున్నారు.

## 1984 వ సం.రం. ఎన్నికల్లో 42 మహిళలు ఎన్నుకోబడ్డారు



స్వాతంత్ర్యం సిద్ధించిన నాటి నుంచి భారతదేశపు పార్లమెంటు సభ్యత్వానికి మహిళల ఎన్నిక అధికమైంది. 1984 వ సం.లో జనరల్ ఎన్నికలలో 542 సభ్యులు గల లోక్ సభకు 42 మంది మహిళలు ఎన్నుకోబడ్డారు. 1980 ఎన్నికలలో 28 మంది మహిళలు మాత్రమే ఎన్నుకోబడ్డారు.

# కొన్ని జంతువులు - వాటి తోకలు

ఎలెనా కొశెంకోవా & అన్నా మిఖాల్స్కాయా

ఏ కొద్దివాటికో తప్ప జంతువు లన్నిటికీ సాధారణంగా తోకలు ఉంటాయి. కంగారు గెంతేటప్పుడు, పరుగెత్తేటప్పుడు తోకను ఆధారం చేసుకుంటుంది. చేపలకు, తిమింగిలాలకు తోకలు నీటిలో ఈదడానికి తెడ్డులా సహకరిస్తాయి. ఉడుతలు తోకతో గెంతటాన్ని నియంత్రించుకుంటాయి.




ఆగ్నేయ ఆసియాలోను, సమశీతోష్ణ మండలంలోను, దక్షిణ ఆఫ్రికాలోను పాంగోలిన్ (pangolin) అనే జంతువు ఉంది. దీని శరీరం అంతా పెద్ద పెద్ద గట్టి పొలుసులతో కప్పబడి ఉంటుంది. చెట్లమీద నివసించే పాంగోలిన్ సాధారణంగా లావు పాటి గట్టి తోకతో చెట్టు కొమ్మ చుట్టూ వ్రేలాడుతూ బలిష్ఠమైన ముందు పంజాలతో, గోళ్ళతో పెద్ద పెద్ద చీమల పుట్టలను పడగొట్టి చీమలను తింటుంది.

నేలమీద నివసించే పాంగోలిన్‌లు వెనుక కాళ్ళమీద తోక ఆధారంతో నుంచుని ముందు [illegible] గోళ్ళతో చీమలపుట్టలను త్రవ్వుతాయి. అనేకరకాల బల్లులు తోకలను విసర్జిస్తూంటాయి. ఎవరైనా బల్లి తోక పట్టుకుంటే వెంటనే గిలగిల కొట్టుకుంటూన్న తోక చేతిలోకి ఊడి వస్తుంది. బల్లి తప్పించుకుని పారిపోతుంది. తోక పట్టుకున్నప్పుడు తోకలో కండరాలు వెంటనే ముడుచుకుంటాయి. వెన్నెముక బలహీనంగా ఉన్నచోట తోక కాస్తా తెగిపోతుంది 50 శాతం ఎలుకలు పట్టుబడినప్పుడు తోక చివర చర్మాన్ని వదలి శత్రువులనుండి తప్పించుకు పోతాయని శాస్త్రజ్ఞులు వెల్లడి చేసారు. ఆఫ్రికాలో నివసించే డార్‌మౌస్‌లకు తోకలో బలహీనమైన కేంద్రాలు ఒక్కొక్కటికి 8 మిల్లీమీటర్ల ఎడంలో అనేకం ఉంటాయి. కాబట్టి ఎక్కడికి అక్కడ తోక వదిలేసుకుంటూ శత్రువుల బారినుండి అనేకసార్లు తప్పించుకోగలవు.

## ఆరోగ్యభాగ్యం లేకపోతే అంతా శూన్యమే

ఆరోగ్యాన్ని గురించి అరబ్బుల తాత్విక భావం ఒకటి ఉంది. ఆరోగ్యం అంకె ఒకటిని సూచిస్తే అనురాగం, ప్రఖ్యాతి, విజయం శూన్యాన్ని సూచిస్తాయి. ఒకటి అనే ఆరోగ్యాన్ని వీటిముందు ఉంచితే నీవు గొప్ప ధనవంతుడవే. కాని ఆ ఒకటీ లేకపోతే అంతా శూన్యమే.

—జాక్ డెంటన్ స్కాట్

"పండడానికి పనికి రాని వసుధ,
వసుధ లేని వాన ఎందుకు పనికిరా

ఉడుతలు, బొచ్చుతోనిండిన తోకను బంతిలాచుట్టి శరీరాన్ని కప్పుకుని వెచ్చగా పడుకుంటాయి. బొద్దుగా బొచ్చుతో ఉన్న తోక దీనికి చలివేయకుండా వెచ్చగా రక్షణను ఇస్తుంది.

చీమలను తినే ఆంట్ ఈటర్ (Anteater) పెద్ద బొచ్చుతోకను మెత్తటి పడకగా వినియోగించుకుంటుంది. నిద్ర పోవలసి వచ్చినప్పుడు తోకను పరచుకుని దానిమీద పడుకుంటుంది. పాంగోలిన్ తోక గట్టిగా గణుపు గణుపులుగా ఉంటుంది. ఇది తన తోకను పూర్తిగా వంటిచుట్టూ చుట్టేసుకుంటుంది. రక్షణను కలిగించుకుంటుంది. ఎంత బలవంతుడైనా ఈ తోకను విప్పలేడు.



ముళ్ళపంది సూది మొనలుతేరిన తోకను ఆయుధంగా వాడుకుంటుంది. తేళ్ళు, స్కంక్, రేలు కూడా తోకను ఆయుధంగా వాడుకుంటాయి. కొన్ని జంతువులు తోకలో పోషక పదార్థాలను నిలువ ఉంచుకుంటాయి. మౌస్‌లెమూర్ ఎలుక పరిమాణంలో ఉంటుంది. సాధారణంగా మెడగాస్కర్‌లో నివసిస్తుంది. ఇది వర్షాకాలంలో విస్తారంగా క్రొవ్వును తోకలో నిలువ చేసుకుంటుంది. వేసవికాలంలో తోకచుట్టుకుని చెట్ల తొర్రలలో నిద్రపోతుంది. ఈ కాలంలో తోకలో నిల్వచేసుకున్న క్రొవ్వు హరించిపోతుంది. తోక సన్నగా అయిపోతుంది.

కొన్ని జంతువుల తోకలు మిక్కిలి ఆశ్చర్యకరంగా మనోభావాలను తెలియజేస్తాయి. యజమాని రావడంతోటే అతడి పెంపుడు కుక్క మిక్కిలి అప్యాయంగా తోక ఆడించుకుంటూ, మొరుగుతూ వెంట బడుతుంది. తోక ఆడించడంలో దాని ఆనందాన్ని, సంతోషాన్ని తెలియజేస్తుంది. తోడేళ్ళు గుంపులు గుంపులుగా తిరిగేటప్పుడు తోకలు ఆడించుకుంటూ తమ అభిప్రాయాలను పరస్పరం తెలియ జేసుకుంటాయి.

సాధారణంగా జింకలు పచ్చని గడ్డిని మేస్తూ తిరుగుతుంటాయి. ఉన్నట్టుండి ఎక్కడైనా శత్రువు జాడ వినిపిస్తే చాలు తలఎత్తి చెవులు నిక్కబొడుచుకుని తోక ఎత్తి తెల్లని మచ్చను చూపిస్తుంది. వెంటనే జింకలన్నీ పరుగెత్తుకుపోయి శత్రువుల బారి నుండి రక్షించుకుంటాయి.

('స్పుట్‌నిక్' సౌజన్యంతో)

## ప్రపంచంలో ప్రప్రథమ ఇంటిగ్రల్ సోడియం లాంప్

1954 వ సం.లో జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ (GEC) వారు స్కాట్లండ్ అబర్‌దీన్‌లో ప్రప్రథమ కోల్డ్‌కాథోడ్ వీధి దీపాలు అమర్చారు. 1956 వ సం.లో అదే కంపెని లండన్ సెంట్‌పాన్‌క్రాస్‌లో ప్రప్రథమంగా ఇంటిగ్రల్ సోడియం దీపాలను అమర్చారు.

# హాస్యదృష్టిని అలవరచుకో

ఒకప్పుడు ఒక యువరాజు ఉండేవాడు. ఆ యువరాజు వెలివేయబడ్డాడు. ఊరు నుంచి వెళ్ళిపోవలసి వచ్చింది. యువరాజు ఎప్పుడూ చిరునవ్వుతో సంతోషంగా ఆనందంగా ఉంటుండేవాడు. ఈ యువరాజుని స్నేహితుడైన ఒక వంటవానితో సహా అడవులకు పంపించేసారు. ఇద్దరూ అడవిలో



తిరుగుతున్నారు. అడవిలో వారికి ఆకలేసింది. ఆహారం తయారుచేసుకోడానికి ప్రారంభించారు. యమయాతనతో కష్టపడి వంటవాడు ఒక కుండ, కొద్దిగా బియ్యం సంపాదించాడు. ఆ అడవిలో కష్టపడి నిప్పు రాజబెట్టి మంటమీద వంట తయారుచేశాడు. ఆ ఆహారం తినేముందు శుభ్రంగా స్నానం చేద్దాం అనుకుని ఇద్దరూ చెరువుకి బయలుదేరారు. స్నానంచేసి వచ్చారు. ఇంతలో ఒక కుక్క ఆ వండిన అన్నపు కుండలో తల దూర్చింది. ఆ కుండ మెడ సన్నగా ఉంది. యువరాజు, వంటవాడు వచ్చిన జాడ తెలుసుకుని కుక్క బెదిరిపోయింది. అటూ ఇటూ పరుగెత్తింది. కుండ కాస్తా పగిలిపోయింది కుండ అంచు మాత్రం కుక్క

## 2,75,000 పిల్లలు పోలియోవల్ల వికలాంగులై పోతున్నారు

రోగనిరోధక టీకాలను ఇంకా పూర్తిగా వినియోగించుకోక పోవడం ఎంతో శోచనీయం. దీని ఫలితంగా ప్రపంచంలో 3.5 మిలియనుమంది పిల్లలు ప్రతీ సంవత్సరం మీసిల్స్, పెర్టుస్సిస్, టిటానిస్‌వల్ల మరణిస్తున్నారు. పోలియో వల్ల సుమారు 2,75,000 మంది పిల్లలు వికలాంగులై పోతున్నారు.

—'వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్'

## టిష్యూలను చేర్చి కుట్టడానికి క్రొత్త వస్తువు

సాధారణంగా శస్త్రచికిత్స జరిగిన తరువాత కణజాలాలను చేర్చి కుట్టడానికి గత 2000 సంవత్సరాల నుండి కాట్‌గట్ (Catgut)ను ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు సోవియట్ యూనియన్ ఉజ్బెకిస్థాన్‌లో శాస్త్రజ్ఞులు క్రొత్తగా కేసలాన్ (Kacelon) ప్రోగులను సృష్టించారు. ఇవి కాట్‌గట్‌కంటె ఒకటిన్నర రెట్లు గట్టిగా ఉంటాయి. ఇది కణజాలానికి హాని కలిగించదు. పేనిన తెల్లదారాలలాగా ఉంటాయి. వీటిని గామా కిరణాలతో శుభ్రపరుస్తారు.

'సోవియెట్ యూనియన్' సౌజన్యంతో

"అపకారము చేసిన వారికి ఉపకారం చేయడమే సత్పురుషుల సదాచారం."

మెడలో కంచెలా చిక్కుకు పోయింది.

యువరాజు ఈ దృశ్యం చూశాడు. పక పకా కడుపు ఉబ్బేటట్టు నవ్వుకుంటున్నాడు. కుక్క మెళ్ళో పగిలిన కుండ మూతితో అటూ ఇటూ పరుగెత్తుతూంది. వంటవాడు రెండు చేతులలో తలబాదుకుంటూ లబో లబో అంటూ దుఃఖించడం ప్రారంభించాడు.

వ్యక్తి జీవితంలో ఎన్నెన్నో ఒడుదుడుకులు రావచ్చు. ఆశానిరాశల చెలగాటంలో చిక్కుకుపోవడం, అదృష్టం వచ్చినప్పుడు పొంగిపోవడం, దురదృష్టం ఎదురైనప్పుడు క్రుంగిపోవడం జరుగవచ్చు. ఎటువంటి సంఘటనైనా హితోపదేశాలూ, హితబోధలూ, ఆంక్షలూ పనిచెయ్యవు. మనిషిని దుఃఖావస్థ నుంచి తప్పించి మంచి మార్గానికి మళ్ళించ గలిగేది, ప్రమాదం నుంచి రక్షించి ఆరోగ్యాన్ని, ఆనందాన్ని, బలాన్ని ఇవ్వగలిగేది హాస్యం. ఎటువంటి దుఃఖంలోనైనా హాస్య దృష్టి అలవరచుకో.

('ఇంటర్‌నేషనల్ యోగా గైడ్'
సౌజన్యంతో)

## వ్యవసాయ ఆర్థిక వ్యవస్థలో

ఆర్థిక వ్య
మీద ఆధారపడిన భారత దేశంలో పాడి పరిశ్రమ మిక్కిలి ముఖ్యమైన పాత్రను వహిస్తుంది. 1984-85వ సం. లో పాలు మరియు ఇతర పాల పదార్థాలవల్ల మొత్తం ఆదాయం రూ. 1,00,000 ..
మించింది.

'డెయిరీ ఇండియా

## సైలెంట్ వేలీ నేషనల్ పార్క్

సెప్టెంబరు 7, 1985న సైలెంట్ వేలీ నేషనల్ పార్క్ ప్రారంభింపబడింది. సైలెంట్ వేలీమీదుగా ప్రవహించే కుంతిపుజా (Kunthipuzha) నది దీని చుట్టూ ఆవరించిన ఉష్ణమండలపు సతతహారిత వర్షారణ్యాలను పోషిస్తుంది. పూతపూయని మొక్కల రకాలు (Lichens), వివిధ నాచు రకాలు (Mosses), వివిధ వనస్పతుల (Ferns) జాతులు 50 కి పైగా సక్రమకాలావధిలో చేస్తూన్న బొటానికల్ పరిశోధనవల్ల తెలుసుకోబడ్డాయి. సైలెంట్ వేలీ నేషనల్ పార్క్ మొత్తం వైశాల్యం 8,952 హెక్టరులు. 90 చ.కి.మీ. కంటే కొద్దిగా తక్కువ. ఈ లోయ అనేక రకాలైన జంతువులకు కూడా ఆశ్రయం ఇస్తూంది. ఎగిరే రాకాశి మలబారు ఉడతలు, మానిటర్ బల్లులు, ఐబెక్స్ లేక నీలగిరి థార్ మొదలైనవాటిని ఎగువ వాలులలో చూడవచ్చు. ఏనుగు, స్లాత్ ఎలుగు, చిరుతలు కూడా ఉంటాయి. కేరళ ప్రభుత్వం ఏడవ ప్రణాళికా కాలంలో సైలెంట్ వేలీ నేషనల్ పార్కు అభివృద్ధికి రూ. 2 కోట్లు ప్రత్యేకంగా ప్రకటించింది.

—'పిఐఐబిఎన్ ఎఫ్ఎఫ్' సౌజన్యంతో

ప్రతీకారం, మనోనిగ్రహ సామర్థ్యం
[illegible]

# కాస్మెటిక్స్

దంతాలను శుభ్రపరచుకోడానికి, దంత రోగాలను నివారించుకోడానికి నోటి దుర్వాసనను పోగొట్టుకోడానికి, దంత క్షయానికి, చిగుళ్ళ రోగాలకు టూత్ పేస్టులు, పళ్ళ పొడులు వాడతారు.

తేనె, కొన్ని మూలికలు, వివిధ ఖనిజాలు, సీసము, రాగికాంపౌండులు, రాతిపొడి, ఇటుకపొడి, బొగ్గుపొడి మొదలైన పదా



ర్థాలతో ప్రాచీన కాలంలో పళ్ళపొడులు తయారు చేసుకునేవారు. ఆధునిక కాలంలో కాల్షియం కార్బొనేటు, డైలేక ట్రై కాల్షియం ఫాస్ఫేటు, కాల్షియం పైరోఫాస్ఫేటు, సోడియం మెటా పాస్ఫేటు, హైడ్రేటెడ్ అల్యూమినా మొదలైన వాటిని పళ్ళపొడులలో, పేస్టులలో వాడుతున్నారు. కొన్ని ఫ్లోరైడులు, తక్కువ పరిమాణంలో డిటర్జెంటులు కూడా దంతాల పరిశుభ్రతకు వీటి తయారీలో వాడుతున్నారు. సూక్ష్మజీవుల నిరోధకంగా ముఖ్యంగా వాడబడేవి హెక్సాక్లోరోఫేన్, పెన్సిలిన్ ఫ్లోరైడ్ లోపంగల ఆహారం తినేవారికి ఫ్లోరైడ్ టూత్ పేస్టులు మంచివి.

టూత్ పేస్టులకన్న టూత్ పౌడర్లు లేక పళ్ళపొడులు చౌక. వీటిలో ఎక్కువ పరిణామాత్మకంగా ఉండే వస్తువులు చేర్చడంవల్ల ఇవి చాలా అమోఘంగా ఉంటాయి. సాధారణ ఉప్పు, సోడియం బైకార్బొనేటు కలిపిన పొడి పళ్ళపొడిగా వాడతారు. ఉప్పు రాపిడి వస్తువుగా ఉపయోగపడుతుంది. సూక్ష్మజీవి నిరోధకంగా పనిచేస్తుంది. నోటిలో లాలాజల గ్రంథులనుండి వచ్చే లాలాజలాన్ని మరింత చైతన్యవంతం చేస్తుంది. సోడియం బైకార్బొనేటు వీటిలో అమ్లాలను తటస్థం చేస్తుంది. దంతపు సందుల నుండి కార్బన్‌డైయాక్సైడును విడుదల చేస్తుంది. దీనివల్ల దంతాలమీద చేరి గట్టిపడిపోయిన పండ్ల పాచిని సులభంగా వదలగొడుతుంది. బొగ్గుపొడినికూడా దంతాలను శుభ్రం చేసుకోడానికి ఉపయోగిస్తారు. ఇది నోటి దుర్వాసనలను పీల్చివేస్తుంది. దంతాలను శుభ్రపరుస్తుంది.

దయ గలిగి ఉండటం ఇంకా గొప్పది.

ఒక గ్లాసెడు నీటిలో 1/2 చెంచాడు ఉప్పు, 1/2 చెంచాడు సోడాపొడిని కలిపిన ద్రావణము పుక్కిలించి నోటిని శుభ్రం చేసుకోడానికి మిక్కిలి ఉత్తమమైనది.

క్షవరం చేసుకోడానికి షేవ్ ప్రిపరేషనులు. ఇవి ప్రీ షేవ్ ప్రిపరేషనులు, ఆఫ్టర్ షేవ్ ప్రిపరేషనులు అని రెండు రకాలుగా ఉన్నాయి. ప్రీ షేవ్ ప్రిపరేషనులుగా



షేవింగ్ సోపులు అనేకం వాడతారు. సోపువల్ల వెంట్రుకలలో ఉండే కెరాటిన్ (Keratin) ఉబ్బి చర్మంమీది వెంట్రుకలు వెంటనే చెమ్మ ఆరకుండా ఉంటుంది.

ఆఫ్టర్ షేవ్ తయారీలు: మంగలి కత్తితోగానీ, బ్లేడ్లతోగానీ క్షవరం చేసుకున్నప్పుడు చర్మపు పై పొరను లాగేస్తుంది. ఈ లాగడంలో చర్మం కోసుకుపోవచ్చు, మంట పెంటవచ్చు. వీటిమీద దుమ్ము చేరి సూక్ష్మ జీవులు ప్రభవించడంచేత దురద బయలు దేరుతుంది. సోపులో ఉండే క్షారం (Alkali) చర్మాన్ని పొడిగా ఉంచుతుంది. సూక్ష్మ జీవులు అతి సులభంగా చేరతాయి. ఇటువంటి పరిస్థితులు ఏర్పడకుండా క్షవరం చేసుకున్న తరవాత ఆఫ్టర్ షేవ్‌లోషనులు వాడతారు.

చర్మాన్ని పరిశుభ్రంగా ఉంచుకోడానికి సోపు ప్రాచీనకాలం నుంచీ వాడుతున్నారు. మంచి సోపు లేక సబ్బులో చర్మానికి హాని కలిగించే క్షారం అధికంగా ఉండకూడదు. చర్మంమీద జిడ్డు, మురికిని సమర్థవంతంగా పోగొట్టేదిగా ఉండాలి.

కొబ్బరినూనె, పామ్‌నూనె, ఆలివ్‌నూనె మొదలైన నూనెలు సోపులలో సాధారణంగా వాడతారు. సోడియం సోపులు గట్టిగా ఉంటాయి. పొటాషియం సోపులు మృదువుగా ఉంటాయి. అందంగా కనిపించడానికి రంగు, సువాసన ద్రవ్యం కలుపుతారు. సాధారణంగా సోపులలో మంచి గంధపు నూనెలు అంటీ మైక్రోబియల్ లక్షణాలు కలిగి ఉంటాయి.

పారదర్శకమైన టాయిలెట్ సబ్బులలో గ్లిసరిన్ ఉపయోగిస్తారు. ఇది చెమ్మ ఆరనీయకుండా చర్మాన్ని మృదువుగా నున్నగా ఉంచుతుంది. సోపులలో లెనోలిన్ (జంతువుల బొచ్చునుండి వచ్చే జిడ్డు పదార్థం),

## వార్తాపత్రిక ఆశయాలు

ప్రజాభిప్రాయాన్ని తెలుసుకుని దానికి తగిన ప్రచారం ఇవ్వడం వార్తాపత్రిక యొక్క ముఖ్య ఆశయాలలో ఒకటి. కొన్ని అభిలషణీయమైన అభిప్రాయాలను ప్రజాపీకంలో చైతన్యవంతం చేయడం రెండవది. నిర్భయంగా సమాజంలో దోషాలను వెల్లడిచేయడం మూడవ ఆశయం.

—మహాత్మాగాంధీ.

వేప, శీకాయి మొదలైనవి కూడా చేరుస్తారు. గంధకం చేర్చిన సబ్బులు ముఖం మీద మొటిమలు నివారించుకోడానికి తలలో పొట్టు పోగొట్టుకోడానికీ, ఇతర సాధారణ చర్మరోగాల నివారణకూ చాలా మంచిది.

తల వెంట్రుకలను శుభ్రం చేసుకోడానికి ఉపయోగపడేవి షాంపూలు. ఇవి తల చర్మానికి, కళ్ళకు మంటలు కలిగించకూడదు.



ఇవి రంగు సువాసన ద్రవ్యాలను చేర్చిన ద్రవాలుగాగానీ, ముద్దగాగానీ, పొడిగాగానీ ఉంటాయి. ఏ అపాయం లేకుండా తల రుద్దుకోడానికి శీకాయ వాడతారు. చాలా మంది ఎగ్ షాంపూలు వాడతారు ఇవి శిరోజాలను ఆరోగ్యవంతంగా ఉంచుతాయి. షాంపూలలో ఉండే ప్రోటీనులు శిరోజాలకు పుష్టిని కలిగిస్తాయి. వెంట్రుకలు తెగిపోవు.

హెయిర్‌డైలు (తలరంగులు) ఇప్పుడు సర్వసాధారణం. తల చర్మం మండకుండా, చర్మంమీద దద్దురులు లేవకుండా, ఎలర్జీ కలిగించకుండా ఉండేవి మంచి హెయిర్ డైలు. హెయిర్ డైలు తల వెంట్రుకలకు హాని చేయకూడదు. ఎంతకు సుస్థిరంగా ఉండాలి. వెంట్రుకలకు సహజమైన వర్ణాన్ని ఆపాదించాలి.

రోమనాశినులు (డెపిలేంట్స్) అనవసరమైన చోట్ల పెరిగే రోమాలను నిర్మూలించుకోడానికి వీటిని వాడుతారు. ఇవి సాధారణంగా పౌడరు, పేస్టు, క్రీము, జెల్లీ, ద్రవ రూపాలలో లభిస్తుంది. అల్కాలీ సమక్షంలో 15 శాతం స్ట్రాంటియం సల్ఫైడ్ మంచి నిరపాయకరమైన రోమనాశిని. 2 మొదలు 4 శాతం థియోగ్లైకోలిక్ ఆసిడ్, అల్కాలీ కలిసిన రోమనాశిని చాలా మంచిది. శాశ్వతంగా తిరిగి పెరగకుండా అక్కరలేని వెంట్రుకలను పోగొట్టుకోడానికి ఎలక్ట్రిక్ నీడిల్ ట్రీట్‌మెంట్ మంచిది. X-రే కూడా దీనికి పనికి వస్తుంది. కాని ఇది చర్మానికి చాలా అపాయకరం.

ప్రాచీన కాలంలో ఉపయోగింపబడే సౌందర్యవర్ధక వస్తువులు సాధారణ మూలికా సంబంధమైన వగుటచే నిరపాయకరములు. ఆధునికంగా నేటి కాస్మెటిక్ వస్తువులు ఉపయోగించే కృత్రిమ రాసాయనిక ద్రవ్యాలు అంత క్షేమకరమైనవి కావు. చర్మంమీద దురదలు లేస్తాయి. ఎలర్జీ వస్తుంది. ఇవి నిరపాయకరంగా ఉండడానికీ, చాలాకాలం చెడిపోకుండా కచ్చితమైన విశిష్టతా నియంత్రణతో తయారుకాబడాలి.

## వివేకుల ఉపదేశాలను నిరసించే అంధులు

ఉపదేశాలను పెడచెవి పెట్టే అంధుడు అంధులను అనుసరిస్తాడు. అంధులందరూ చేరి అంధనృత్యంతో అంధ

# స్వామీ వివేకానంద

యువక ధీరుల్లారా: అవిరళ కృషితో మహోన్నత కార్యాలు దిగ్విజయంగా సాధించడానికి మీరు జన్మించారు - అనే విషయాన్ని విశ్వసించాలి. వీధి కుక్కలు మొరగవచ్చు. ఆకాశంలో మేఘాలు పిడుగులతో ఉరమవచ్చు. భయపడిపోవద్దు. సంసిద్ధులు కండు. కార్యదీక్ష వహించండి.




ఇప్పుడు దేశానికి గంభీరమైన సుస్థిర పర్వతాలవంటి ధీర నాయకులు అవసరం. సత్యం జయిస్తుంది. ఈనాడు భారతదేశపు ప్రజానీకంలో చైతన్య శక్తిని ప్రభవింప జేయడానికి ఒక నూతన విద్యుత్ జ్వాల ప్రజ్వరిల్లాలి.

ధైర్యాన్ని అవహించండి. ధైర్యవంతుడు ఒకసారే మరణిస్తాడు. నా శిష్యులు పిరికి పందలు కాకూడదు. పిరికితనం మిక్కిలి హేయమైనది. గంభీరమైన మనో నిబ్బరాన్ని స్థిరపరచుకోండి. అవివేకుల కువిమర్శలకు చెవులు మూసుకోండి. లెక్కచేయక నిర్లక్ష్యంతో ఉపేక్షాభావం వహించండి. జ్ఞాపకం పెట్టుకోండి. భగవంతుడు మీకు రెండు కళ్ళు ఇచ్చాడు. రెండు చెవులు ఇచ్చాడు. నోరు ఒక్కటే ఇచ్చాడు. ఎన్నెన్నో బ్రహ్మాండమైన కార్యాలన్నీ అనేక కష్టాలతో, విఘ్నాలతో సాధించినవే. గంభీరమైన పురుషకారంతో విజృంభించాలి. యావత్ శక్తిని వినియోగించాలి. లోభత్వంతో, కామినీ కాంచన వ్యామోహంతో విర్రవీగేవారిని తృణీకరించాలి.

ఓ స్నేహితులారా! ఎందుకీ మోహం! ఎందుకీ విచారం? పరిపూర్ణమైన శక్తి మీలో అణిగి వుంది. మీ శక్తినంతా కూడదీసుకోండి. విశ్వం మీ పాదాలమీద మోక

నేను విజయం పొందలేకపోయినా
సత్యసంధుడనై ఉం
నేను గెలుపు సాధించలేకపోయినా
నా హృదయజ్యోతి ప్రకాశిం
జీవిం
సక్రమమైన న్యాయమైన మార్గం
అనుసరించే వారిని అనుసరిస్తాను.
అతడు తప్పుదారి పట్టినప్పుడు
వదిలేస్తా

—అబ్ర



రిస్తుంది. శరీరం కాదు, మీ ఆత్మ జయి స్తుంది. శరీరమే నిత్యం అని నమ్ముకున్న వారు వట్టి మూఢులు. దేశానికి కావలసింది ధైర్యం, ఉత్సాహం, విజ్ఞానం. సృజనాత్మక చైతన్యంతో బ్రహ్మాండమైన శక్తి ఉప్పొంగాలి. సాహసోపేతుడైన ధైర్యవంతులను లక్ష్మీదేవి తనంతటతానే వరిస్తుంది. వెనుకకు తిరుగనవసరం లేదు. బ్రహ్మాండమైన ధైర్యం, ఉత్సాహం అవసరం. అప్పుడు గొప్ప గొప్ప కార్యాలను దిగ్విజయంగా సాధించగలుగుతారు.

శక్తే ప్రాణము. శక్తి హీనత మరణం. శక్తి అఖండ సచ్చితానందాన్ని ఇస్తుంది. శాశ్వతమైన అమరత్వాన్ని అపాదిస్తుంది. అశక్తతవల్ల నిరంతర విభజన ఏర్పడుతుంది. ఇది మరణంతో సమానం. బలవత్తరమైన ధనాత్మభావాలు చిన్ననాటినుంచీ మనస్సులో ఉద్భవించాలి.

బ్రహ్మాండమైన శక్తి కావాలి ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న రోగానికి శక్తి వాజీకర ఔషధం వంటిది. ధనికులచే పీడింపబడుతున్న దరిద్రులకు ఈ శక్తి దివ్య ఔషధం. వివేకుల బాధింపులకు అవివేకులకీ ఔషధం కావాలి.

ధైర్యంతో నిలబడండి. పూర్తి బాధ్యతలను మీ భుజాలపై మీరు వహించండి. మీ అదృష్టానికి ఎవరో కాదు మీరే కారకులు. మీకు కావలసిన శక్తి, సహాయం మీలో నిబిడమై ఉంది. కాబట్టి మీ భావి జీవితాన్ని తీర్చి దిద్దుకోండి.

ప్రకృతిని ఎదిరించి దిగ్విజయాన్ని పొందాలనుకున్నంతవరకు మానవుడు మానవుడే. పకృతి నీలో ఉంది. ప్రకృతి నిన్ను ఆవరించి ఉంది. నిన్నావరించి ఉన్న బాహ్య ప్రకృతిని జయించడం ఆనందకరం. అంతరిక ప్రకృతిని జయించడం మరింత గర్వకారణం. ఖగోళంలో నక్షత్రాలను, గ్రహాలను నడిపించే సూత్రాలను తెలుసుకోవడం మంచిది. మీ మానసిక శక్తులను, గుణాలను నడిపించే సూత్రాలను తెలుసుకోవడం అంతకంటే ఉత్తమం.

మహాసముద్రపు అఖాతాలలోకైనా మునిగి మరణానికి తెగించి పట్టుదలతో, దీక్షతో విశ్వరహస్యాలను పరిశోధించడానికి ఇనుప కండరాలు, ఉక్కునాడులు నేడు దేశానికి కావాలి.

## పొగ త్రాగడంవల్ల సంభవించే మరణాలు



యూరపులో 5,00,000 కంటే అధికంగా మరణాలు పొగత్రాగడంవల్లే సంభవిస్తున్నాయి.

పొగత్రాగడం అనే దురభ్యాసం ప్రతీ సంవత్సరం 3,50,000 అకాల మరణాలు అమెరికాలో సంభవిస్తున్నాయి. ప్రపంచం అంతటా ప్రతీ ఏటా

౨ 10.00

## మొట్టమొదటి బైసికిల్‌ను లియొనార్డో డిజైను చేశాడు:



సుప్రసిద్ధ ఇటాలియన్ నవ్య కల్పనా కారుడు లియొనార్డో డా విన్సీ 1493 వ సం.లో మొట్టమొదట బైసికిల్‌ను డిజైను చేశాడు. అయినా 1839 వ సం. నాటికి గానీ బైసికిల్ నిర్మించబడలేదు.

* * *

## కంప్యూటర్‌ను ఓడించిన ఫ్రెంచి ఘనుడు:

సుమారు 20 సంవత్సరాలకు పూర్వం ఫ్రాన్స్ దేశస్థుడైన డాగోబెర్డ్ (DagoBert) ఒక కంప్యూటర్ 7 లెక్కలు చేసేటప్పటికి తను 10 లెక్కలు చేస్తానని చెప్పాడు. బ్రహ్మాండమైన వేగంతో 48,627,125 వంటి పెద్ద పెద్ద 10 సంఖ్యలకు 1 నిమిషం 35 సెకండ్లలో ఘాతములు, వర్గమూలములు కట్టాడు. కంప్యూటర్ 5 నిమిషాల 18 సెకండ్ల కాలంలో 7 లెక్కలను మాత్రమే కట్టగలిగింది. 'స్పుట్‌నిక్' సౌజన్యంతో

## 20,00,00,000 పౌండ్లకు మించిన ఆస్తి:

నెదర్ లాండ్స్ మాజీమహారాణి ప్రిన్సెస్ విల్ హెల్మినా (1890_1948) మరణించే నాటికి 20,00,00,000 పౌండ్లకు మించిన ఆస్తి ఉంది.

* * *

## 10 డౌనింగ్ స్ట్రీటు భవనానికి తాళం లేదు:

నెం. 10 డౌనింగ్ స్ట్రీటు భవనానికి (బ్రిటిషు ప్రధానమంత్రి అధికార నివాసం) ఎవ్వరి దగ్గరా - ప్రధాన మంత్రి దగ్గర కూడా తాళం లేదు. భవనం తలుపులు లోపల నుంచి తెరుచుకుంటాయి.

* * *

## పుట్టుకలోనే పళ్ళు! :

ఇంగ్లండు రాజు 3 వ రిచర్డు, ఫ్రాన్స్ రాజు 14 వ లూయి, ఫ్రెంచి మిలటరీ మరియు రాజకీయ నాయకుడు నెపోలియన్ నోటిలో దంతాలతోనే పుట్టారు.

* * * *

## నిశ్చయం చేసుకున్న 67 సం.లకు పెళ్లి:

మెక్సికో నగరంలో ఒక వరుడు, ఒక వధువు వివాహం నిశ్చయం చేసుకుని 67 సంవత్సరాల తరువాత 82 వ ఏట వివాహం చేసుకున్నారు.





ఎఫ్.సి. సోంది

వివాహము అంటే పెండ్లి, పరిణయము.

పూర్వం పెళ్ళిళ్ళు ఎనిమిది రకాలుగా ఉంటాయని శాస్త్రకారులు నిర్ణయించారు. బ్రాహ్మ వివాహము. దైవ వివాహము. ఆర్య వివాహము. ప్రజాపత్య విహహము. ఆసుర వివాహము. గాంధర్వ వివాహము.



రాక్షస వివాహము. పైశాచిక వివాహము. ఇప్పుడు ఈ పెళ్ళిళ్ళు దేశ కాల పరిస్థితులను అనుసరించి జరుగుతున్నాయి. రిజిష్టరు ఆఫీసులో వధూవరులు సంతకాలు చేసుకుని పెళ్ళి చేసుకుంటారు. నలుగురి పెద్దల సమక్షంలో పూలదండలు మార్చుకుంటారు. ఉంగరాలు మార్చుకుంటారు గుడిలో పేర్లు చెప్పుకుని వధూవరులు ఇద్దరు ప్రసాదం తీసుకుంటారు. ఇంతేగాకుండా శాఖాంతర వివాహాలు, రాష్ట్రాంతర వివాహాలు, మతాంతర వివాహాలు' కులాంతర వివాహాలు అనేక రకాలు జరుగుతున్నాయి. ప్రపంచం అంతటా వీటిని గౌరవిస్తున్నారు.

పెళ్ళి అంటే సందడి, సంతోషం. పెళ్ళి చేసుకున్న తరువాత ఈ సంతోషాన్ని వర్థిల్ల చేసుకోవాలి. ఒక రోజు సమస్యకాదు, పెళ్ళి అంటే నూరేళ్ళ పంట. భార్యాభర్తలు జీవించి ఉన్నంతకాలం వైవాహిక జీవితం ఒడుదుడుకులు లేకుండా సరళంగా జరగాలి.

జీవితంలో ప్రాతిపదికంగా రెండే మార్గాలు గోచరిస్తున్నాయి. దానవిధానం. పరిగ్రహణ విధానం. లోకంలో రెండే రకాల మనుష్యులు కనిపిస్తారు. ఇచ్చేవారు, పుచ్చుకునేవారు. ఇవ్వడం అంటే సహకార విధానం, వైవాహిక జీవితంలో ప్రతీ విషయంలోను తోడ్పడటం.

ప్రేమించి చేసుకున్న పెళ్ళి అయినా సరే, క్రమపద్ధతిలో ఏర్పాటు చేసుకున్న పెళ్ళి అయినా సరే, నిర్బంధ వివాహమైనా సరే భార్యాభర్తల మధ్య భిన్నాభిప్రాయాలు పొడసూపుతూనే ఉంటాయి. ఇద్దరూ రెండు వివిధ వాతావరణాలు నుండి వచ్చినవారు వారు పెరిగిన విధానాలు వేరు. వారి వారి అలవాట్లు వేరు. పరస్పర భేదాభిప్రాయాలను మన్నించుకోవాలి. లోటుపాట్లను సర్దుకోవాలి.

---

## ఎంకి గ్రాతన

## మైన ప్రభుత్వ బ్యాంక్

స్వీడెన్ స్టాక్‌హోమ్‌లో స్టోర్‌కిర్‌కాన్ (Storkyrkan) చర్చిదగ్గర ఒక చిన్న ద్వీపంలో రిక్స్‌బాంకు ప్రపంచంలో

[illegible] ప్రభువులు, వృక్షాలు లేని [illegible]

శారీరక సంబంధమైన భౌతికప్రేమ మంచిదే కానీ దానికి తోడు పవిత్రమైన పారమార్థిక ప్రేమ మీ హృదయంలో ఉండాలి. ప్రస్తుతం వెంటనే మీ దగ్గర ఉన్నది మీ భార్యో, మీ భర్తో. కాబట్టి దయా దాక్షిణ్యాలతో ప్రవర్తించడం అవసరం. నువ్వు నిన్ను ఎలా ప్రేమించదలచుకుంటావో నీవు అలా ఇతరులను ప్రేమించు.

మీలో ఎవరైనా కోపోద్రిక్తంతో శృతి తప్పి మాట్లాడుతుంటే ఇంకొకరు మౌనం వహించడం ఉత్తమం. ఒకరు చెప్పినదానిని జాగ్రత్తగా విను. కనికరంతో, సాను భూతితో విను. అలక్ష్యం చేయకూడదు.

ఇంట్లో శాంతి ఉంటే మీ మనస్సు రోజంతా శాంతంగా ఉంటుంది. హాయిగా ఉంటుంది. చెప్పదలచుకున్నది పెద్ద పెద్ద కేకలతో అట్టహాసంగా గట్టిగా చెప్పక్కర్లేదు. నెమ్మదిగా, నాజూకుగా చెప్పడంవల్ల ఎంతో ఉపకారం జరుగుతుంది.

"ఎంతో బాగుంది", "బాగా చేసావు" అనే మాటలు దొర్లుతుండాలి. నీవు చాలా మంచి పని చేసావు అంటూండాలి. అభినందించ డానికి, పొగడడానికి ఎంత మాత్రం వెను దీయకు. ధారాళంగా ఉండాలి.

ఎవ్వరూ కూడా 100 శాతం నిష్కళం కంగా ఉండలేరు. 100 శాతం దోష భూయిష్టంగా ఉండలేరు. మనలో అందరికీ ఏవో లోటుపాట్లు ఉంటాయి. ఎప్పుడూ ఎదుటివారి మంచి గుణగణాలనే చూస్తుం డాలి.

ఎన్నడూ అధికారం చలాయించవద్దు. శరీరాలు వేరైనా ఆత్మలు ఒకటే అనే భావాన్ని కలిగించుకోండి. మెరిసేదంతా బంగారం కాదు. కాబట్టి పట్టి లోభంతో, మోహంలో పడి మోసపడిపోకు. నమ్మిన దైవాన్ని భక్తితో విశ్వసిస్తూ సంతృప్తికర మైన జీవితాన్ని జీవించు.

ఎప్పుడూ చిరునవ్వుతో ఆనందంగా సమస్యలను పరిష్కారం చేసుకో. చిరు నవ్వుతో ఉండు. ఒక్క మానవ జాతికే ఈ ప్రత్యేక లక్షణం లభిస్తుంది. ఇంక ఏ ఇతర ప్రాణికి ఈ అపూర్వమైన గుణం లేదు.

## ప్రప్రథమంగా చంద్రమండలం చేరిన మానవ నిర్మిత వస్తువు




మొట్టమొదట చంద్రమండలం చేరినది. సోవియెట్ యూనియన్ నుండి అంతరిక్షం లోకి ప్రవేశపెట్టబడిన మానవ నిర్మితమైన వస్తువు లూనా-2. ఇది 1959 వ సం రం సెప్టెంబరు 14 న చంద్రమండలం మీద పడింది. 1979 వ సం. రం సెప్టెంబరు 1 వ తేదీన అమెరికా అంతరిక్షనౌక పయొనీరు - 11 శనిగ్రహంమీదుగా ప్రయాణం చేసింది. ఈ విధంగా ప్రయాణంచేసిన మొదటి అంత రిక్షనౌక ఇదే.

# సర్పవిషం కొన్ని రహస్యాలు

టి. ఎస్. ఎన్. మూర్తి

విషపాముల నోటిలో ప్రత్యేక గ్రంథుల నుండి, విషపు కోరల సందుల నుండి ఊరే లాలాజలమే విషం. దీనినే గరళం అంటారు. పాము విషగ్రంథులు మానవుని నోటిలో ఉండే లాలాజలగ్రంధి పారోటిడ్ (Parotid) ప్రమాణంలో ఉంటుంది.



సాధారణ త్రాచుపాము, రస్సెల్స్ వైపర్ అధికంగా విషాన్ని కలిగి ఉంటుంది. ప్రపంచంలో విషకరమైన పాము లన్నిటిలోను కోడెత్రాచుపాము (King Cobra) అత్యధికంగా విషాన్ని కలిగి ఉంటుంది. ఇది సాధారణంగా 500 మి.గ్రా.లు ఉంటుంది. ఒక మనిషిని చంపడానికి $\frac{1}{2}$ మి.గ్రా. విషం చాలు. అంటే రెండే రెండు ఇసుక రేణువులంత విషం మనిషిని చంపేస్తుంది.

బాగా పెరిగిన త్రాచుపాము 15 మంది మనుషులను చంపడానికి చాలినంత విషాన్ని కలిగి ఉంటుంది. భారతదేశంలో పొడ పాము (క్రెయిట్)కి 35 మందిని చంపగల విషం ఉంటుంది. రస్సెల్స్ వైపర్ విషం 15 చుక్కలు ఒక మనిషిని చంపేస్తాయి. సముద్రపు పాము (Sea snake) విషం ఒక్క చుక్క చాలు అయిదు మందిని చంపడానికి.

భారతదేశంలో సాధారణంగా పాము కాట్ల ప్రమాద వార్తలు గ్రామాలనుంచి తరచు వస్తుంటాయి. గ్రామాలలో వ్యవసాయదారులు, వారి కుటుంబ వ్యక్తులే ఎక్కువగా దానికి గురి అవుతూంటారు. త్రాచు పాము (Cobra), పొడ పాము (krait) - వర్షాకాలంలో గుడ్లను పొదిగే సమయంలో ఈ పాములు ఎక్కువగా కరుస్తుంటాయి.

త్రాచుపాము (Cobra) విషం నరాలలో చేరి ప్రభావితం అవుతుంది. వైపర్ విషం రక్తంలో చేరి రక్తం విషంగా పరిణమిస్తుంది. త్రాచుగానీ, క్రెయిట్‌గానీ కాటు వేస్తే మనిషి నీరసపడిపోయి పక్షవాతంతో పడిపోతాడు. వైపర్ కరిస్తే చాలా బాధ పెడుతుంది. కరచినచోట మంట ఎక్కువగా ఉంటుంది. అవయవాలు వాస్తాయి. చర్మము, చర్మకణాలు రంగుమారిపోతాయి.

(మిగతా 46 వ పేజీలో)

## మిక్కిలి ఎక్కువ గల వారపత్రిక

మిక్కిలి అధికంగా సర్క్యులేషన్ గల వారపత్రిక యుఎస్ఎలో టివిగైడ్. 1974 వ సం.లో 1000 మిలియను కాపీలు అమ్ముడుపోయిన ఈ పత్రిక రికా

శత్రువులో మంచిని, మిత్రుడిలో చెడును సమదృష్టితో చూడగలవాడు మహాత్ముడు

# సరస్వతి

ఎన్. రామకృష్ణ

విద్యకు అధిదేవత సరస్వతి. భారతదేశంలో సరస్వతీదేవికి దేవాలయం చాలా అరుదు. తమిళనాడు తంజావూరు జిల్లా కూత్తనూర్ గ్రామంలో సరస్వతీదేవికి అపురూపమైన దేవాలయం నిర్మింపబడింది. నన్నిలం తాలూకాలో అరసిలార్ నది గట్టుమీద ఈ ఆలయం నిర్మించబడింది. ఇది మయిలాడు


KOOTHANUR SARASWATHY

దురై-తిరువారూరు బస్సు మార్గంలో ఉంది.

కూత్తనూరులో వెలసిన సరస్వతీదేవికి సుప్రసిద్ధ తమిళ కవి ఒట్టకూత్తర్ భక్తుడు. ఒట్టకూత్తర్, కంబర్, అవ్వయార్ మరియు ఇతర కవుల సమకాలికుడు. ఈ కవులందరు సుమారు వెయ్యి సంవత్సరాలకు పూర్వం 2 వ కుళోత్తుంగచోళుని కాలంలో నివసించారు.

ఈ దేవాలయంలో సరస్వతి విగ్రహం పద్మాసనంలో కూర్చుని ఉంటుంది. పైకుడి చేతిలో అక్షమాల ధరించి ఉంటుంది. క్రింద కుడిచేతియందు చిన్ముద్ర కలిగి ఉంటుంది. పై ఎడమ చేతిలో గిన్నె, క్రింది ఎడమచేతిలో వేదాలు ఉంటాయి. ఈ దేవత భక్తులకు ఎన్నెన్నో వరాలు ఇచ్చిందని ప్రసిద్ధి

కూత్తనూరు సరస్వతీదేవాలయం చుట్టూ అనేక ఇతర దేవాలయాలు ఉన్నాయి. సరస్వతీదేవి గర్భాలయానికి చేరువగానే సరస్వతీదేవి భర్త బ్రహ్మకు దేవాలయం ఉంది.

దుర్గ, సరస్వతి, లక్ష్మి అవతారాలుగా ఆవిర్భవించిన మాతృమూర్తికి దేవాలయాలు మూడూ ఒకేచోట కూత్తనూరులో ఉండడం చాలా విచిత్రం.

కూత్తనూరులో భక్తులు నవరాత్రి ఉత్సవం అత్యంత వైభవంగా జరుపుకుంటారు. నవరాత్రి సమయంలో ప్రత్యేకంగా సరస్వతీ పూజలు చేస్తారు. విజయదశమి రోజున సరస్వతీదేవి కంచు విగ్రహాన్ని హంసవాహనంపై ఊరేగిస్తారు.

## ముఖచిత్ర వ్యాఖ్య

(జూన్ !

"స్వాభావిక సుందరి
సౌందర్యలహరి."
—బి. ఉమామహేశ్వరరావు, కవిటి.

* * *

"వస్తు నిర్మాణానికి ప్రతీక,
అదే మీ దేశాని కున్న ప్రత్యేకత."
—తెంబూరుగాపం, కొరసండ.

# లక్ష్యాలు, ప్రణాళికలు ఉన్నవాళ్ళే నాయకులు

ప్రకాష్ జె.షా

జీవితంలో ఉన్నతాశయాలకు లక్ష్యాలు, ప్రణాళికలు ఉన్నవాళ్ళే సుప్రసిద్ధ నాయకులుగా రాణిస్తారు. లక్ష్యాలు, ప్రణాళికలు లేకుండా జీవితం గడిపేవారు కేవలం యధాలాపంగా అందరిలా జీవితాన్ని గడుపుకుంటారు.

ముందుగా నిర్ణయించుకున్న లాభవంతమైన లక్ష్యాలను క్రమక్రమంగా సాధించడమే విజయం అనిపించుకుంటుంది. జీవితంలో నిస్వార్ధమైన సేవానిరతితో కష్టపడి శ్రమకోర్చి పనిచేస్తేగానీ దేన్నీ సాధించలేవు. విజయం పొందలేవు. నీ ఉద్యమంలో అనేకసార్లు అపజయం కలుగవచ్చు. కష్టాలు కలుగవచ్చు. ఎటువంటి క్లిష్టపరిస్థితులనైనా సరే చిరునవ్వుతో ఎదుర్కొంటూ ఆనందమయంగా ఉండగలిగినప్పుడు, ఇతరులకు సహాయం చేస్తూ సక్రమవిధానంలో సొమ్ము వెచ్చించినపుడే ధైర్యోత్సాహాలతో విజయం సాధించగలవు. ఉన్నత స్థాయిలో సత్ సంకల్పాలను వృద్ధిచేసుకుంటుంటే జీవితంలో ముమ్ముందుకు పోగలుగుతావు.

నీవు అనుభవించే ప్రతీ క్లేశానికి, కష్టానికి సరిసమానమైన లేక దానికి మించిన సదవకాశం లభించి తీరుతుంది. విజయశాలి విరమించుకోడు. విరమించేవాడు ఎప్పుడూ విజయం పొందలేడు. దానశీలుడవు అవాలి. ఇతరులకు కావలసినంత ఇచ్చి వారిని మరింత ధనికులుగాను, మరింత సౌఖ్యవంతులుగాను చేస్తేనే తప్ప నీకు ధనం, సౌఖ్యం లభించదు. సాంఘిక కార్యకలాపాలలో శ్రద్ధ వహించు. నీలో సమాన ఆశయాలు ఉండేవారితో స్నేహ బంధాలు కలుపుకో. ఎప్పుడూ నీ లక్ష్యాలను నీ సిద్ధిని గురించే చింతిస్తూండు. ప్రతిదినం నీ లక్ష్యానికి మరింత చేరువ అవడానికి యత్నాలు కొనసాగిస్తూండు.

జీవితాన్ని మరింత విలాసవంతం చేసుకో. యాతనామయం చేసుకోకు. మొదట మానవులకు కొన్ని అలవాట్లు అలవడుతాయి. ఆ తరువాత అలవాట్లు నిన్ను నిన్నుగా తీర్చిదిద్దుతాయి. కాబట్టి మంచి అలవాట్లను అభ్యాసం చేసుకో. సత్ సాంగత్యం చేస్తూండు. జీవితంలో పై పైకి ఎగబ్రాకిపోతావు.

## మగ ఏనుగుల మందలు ఉండవు



ఏనుగులలో పూర్తిగా ఆడ ఏనుగుల మందలు ఉంటాయేగానీ పూర్తిగా మగ ఏనుగుల మందలు ఉండవు.

[illegible]
స్వయంగా నరకమును సృష్టించుకుంటారు.

## త్రిభువన్‌దాస్‌కి 'గోల్డ్ స్టార్' అవార్డు:

1987 వ సం.పు గౌరవప్రదమైన అమెరికన్ అవార్డు 'గోల్డ్ స్టార్' త్రిభువన్‌దాస్ భీమ్‌జీ జవేరీకి ఇవ్వబడింది. 1986 వ సం లో ఢిల్లీకి చెందిన జవేరీ జ్యూయలరీ న్యూయార్క్‌లో మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

* * *

## సుభాష్ ముఖోపాధ్యాయ్‌కి నేషనల్ కబీర్ సమ్మాన్:

సుప్రసిద్ధ బెంగాలీకవి సుభాష్ ముఖోపాధ్యాయ్‌కి రూ. 1 లక్ష విలువ చేసే 1987-88 వ సం. రం నేషనల్ కబీర్ అవార్డు లభించింది.

* * *

## మిర్చ్ మసాలాకు ఈస్ట్ వెస్ట్ సెంటర్ అవార్డు:

7 వ వార్షిక హవాయి అంతర్జాతీయ ఫిల్మ్ ఉత్సవంలో కేతన్ మెహతా 'మిర్చ్ మసాలా'కి ఈస్ట్ వెస్ట్ సెంటర్ అవార్డు దక్కింది.

* * *

## ఉస్తాద్ జియా మొహియుద్దీన్‌కి కాళిదాస్ సమ్మాన్ అవార్డు:

డాగర్స్ (Dagars) అనే సుప్రసిద్ధ సంగీత కుటుంబానికి చెందిన రుద్రవీణ యుద్దీన్ డాగర్‌కి సాంప్రదాయ సంగీతానికి కాళిదాస్ సమ్మాన్ అవార్డు లభించింది.

* * *

## పాలియోబోటనీ సొసైటీ గోల్డ్ మెడల్:

ఇండియన్ నేషనల్ సైన్స్ అకాడమీకి చెందిన డా. డి. డి. పంత్‌కి గౌరవప్రదమైన అంతర్జాతీయ పాలియో బోటనీ సొసైటీ స్వర్ణపతకం లభించింది. ఇది భారతీయుడికి లభించడం ఇదే మొదటిసారి

---

## వర్షాకాలాన్ని సూచించే "కుకూ"



తలపై రంగు కుచ్చు ఉండే కుకూ (Cuckoo) కోకిల జాతికి చెందిన ఒక పక్షి. వర్షాకాలాన్ని ఖచ్చితంగా సూచిస్తూ వర్షాకాలపు పక్షి (Monsoon Bird) అనే పేరు సార్థకం చేసుకుంది. ఈ రోజు ఆ పక్షి కనిపిస్తే 15 రోజులలో వాన గాలులు వీసాయి.

## రసాయనిక ఎరువుల వినియోగం పెరుగుదల 6.2%:

భారతదేశంలో రసాయనిక ఎరువుల వినియోగం 1984-85 సం.లో 8.211 మిలియను టన్నుల నుండి 1985-86 సం. లో 9.722 మిలియను టన్నులకు పెరిగింది. ఈ పెరుగుదల ప్రమాణం 6.2 శాతం. అదే కాలంలో ఎరువుల ఉత్పాదన కూడా 5.235 మిలియను టన్నుల నుండి 5.753 మిలియను టన్నులు అంటే 9.9 శాతం పెరిగింది.

(అన్యువల్ రివ్యూ ఆఫ్ ది ఫెర్టిలైజర్స్ ప్రొడక్షన్ అండ్ కన్‌సమ్షన్)

* * *

## ఫిన్‌లాండ్ ఉద్యోగస్తులలో మహిళలు 48 శాతం:

1982-85 సంవత్సరాల మధ్య కాలంలో అభివృద్ధి పొందిన దేశాలన్నిటిలోను మొత్తం ఉద్యోగస్థులలో మహిళలు 33 నుంచి 45 శాతం. ఫిన్‌లాండ్‌లో ఉద్యోగస్థులలో మహిళలు 48 శాతం, స్వీడెన్‌లో మహిళలు 47 శాతం, సింగపూరు మరియు దక్షిణ కొరియాలలో మొత్తం ఉద్యోగస్థులలో మహిళలు వరుసగా 36 శాతం మరియు 39 శాతం ఉన్నారు. 1982-85 సం.ల మధ్య కాలంలో లాటిన్ అమెరికా దేశం ఉరుగ్వేలో మొత్తం ఉద్యోగులలో మహిళల శాతం 38 నుంచి 41 శాతానికి బాగా అధికంగా పెరిగింది.

## భారతదేశంలో జనాభా పెరుగుదల సం॥కి 2.5%:

భారతదేశం జనాభా సంవత్సరానికి 2.5 శాతం పెరిగిపోతూంది. చైనాలో జనాభా పెరుగుదల సంవత్సరానికి 1.4 శాతం మాత్రమే.

## 1986-87 సం.లో బట్ట ఉత్పత్తి 12,777 మిలియను మీటర్లు:

భారతదేశంలో పవర్‌లూములు, హాండ్‌లూములు, మిల్లు రంగా లన్నిటిలోను

## సీతాకోకచిలుకలు తీపిని తెలుసుకుంటాయి



3,00,000 పాళ్ళ నీటిలో క[illegible]లు తీపిని సీతాకోక చిలుకలు [illegible]యి.

"క్రమశిక్షణ లేకపోతే బ్రతుకే వంకర టింకర!"

1984-85 సం.లో 12,014 మిలియను మీటర్ల బట్ట ఉత్పాదన 1986-87 సం. కి 12,777 మిలియను మీటర్లకు పెరిగింది.

* * *

## 1986-87 వ సం.లో ఉత్పత్తి కాబడిన నూలు 1,471 మిలియను కి. గ్రాలు:

1986-87 సం.లో భారత దేశంలో ఉత్పత్తి కాబడిన నూలు మొత్తం 1,471 మిలియను కి. గ్రా.లు. ఇదే 1984-85 వ సం.లో 1,382 మిలియను కి.గ్రా.లు.

* * *

## 61 శాతం విటమిను 'బి' నష్టం:

దంపుడు బియ్యం వాడి ఆరోగ్యకరంగా జీవించవచ్చు. బియ్యం మర పట్టిస్తే అందులో ఉండే విటమిను 'బి' సత్తువ 61 శాతం నష్టమైపోతుంది. దంపుడు బియ్యంలో విటమిను 'బి' సంరక్షింపబడుతుంది. దంపిన పచ్చిబియ్యం తినడంవల్ల నగటున రోజుకి మనిషికి కావలసిన 1 మి.గ్రా. విటమిను 'బి' లభిస్తుంది.

—ఖాదీ క్రాఫ్ట్స్, మద్రాసు సౌజన్యంతో

* * *

## అక్ట్రాయి వసూలు వల్ల కలిగే నష్టం:

ఊరి పొలిమేర్ల వద్ద గేట్ల దగ్గర వసూలు చేయబడే అక్ట్రాయి (Octroi) వల్ల రోజుకి సుమారు 2.25 లక్ష ట్రక్ మైళ్ళ నష్టం ఏర్పడుతూంది. వాహనాలను నిలిపివేయడం వల్ల సాలీనా రూ. 8.2 కోట్ల నష్టం ఏర్పడుతుంది ఇంధనం మీద కూడా రూ. 1,000 కోట్ల నష్టం ఏర్పడుతూంది.

* * *

## 374 అణువిద్యుత్ కేంద్రాలు:

మొత్తం 26 దేశాలలో 374 అణు విద్యుత్ కేంద్రాలు పనిచేస్తున్నాయి. ఇవి 2,49,625 మెగావాట్ల శక్తితో ప్రపంచం మొత్తం విద్యుత్‌శక్తిలో 15 శాతం విద్యుత్తును జనింపజేస్తున్నాయి.

## తన బుద్ధికుశలతపై ఉన్నతాభిప్రాయం లేని డార్విన్



సుప్రసిద్ధ పరిణామ సిద్ధాంతాన్ని ఏర్పరచిన బ్రిటిషు దేశానికి చెందిన జంతుశాస్త్రజ్ఞుడు ఛార్లెస్ రాబర్ట్ డార్విన్ (1809-1882)కి చిన్నప్పుడు తన కుశాగ్రబుద్ధిమీద ఉన్నతాభిప్రాయం లేదు.

# నిర్మా సాధించిన ఘనత

ఎఫ్.ఎమ్. బ్రిట్టో

'నిర్మా' డిటర్జెంట్ పౌడర్ కనిపెట్టి వ్యాపారం కొనసాగిస్తూన్న కర్సన్ భాయ్ పటేల్ త్వరలో నే భారతదేశంలో మిక్కిలి గొప్ప ధనవంతులలో ఒకడుగా పరిగణింప బడతాడు.

1986 వ సం.లో ఇతడు కొనసాగించిన 'నిర్మా' వ్యాపారం విలువ మొత్తం రూ. 200 కోట్లు. 1987 వ సం.లో ఇది రమారమి రూ. 350 కోట్లు. 1988 వ సం.లో కొత్తగా నిర్మా సోపు, నిర్మాటూత్‌పేస్టు ప్రవేశపెట్ట డంతో ఇతడి వ్యాపారం విలువ రూ. 600 కోట్లకు పెరుగుతుందని అంచనా.

ప్రస్తుతం ప్రపంచంలో నేడు రోజుకి 500 టన్నులు — ఒక నిర్మా డిటర్జెంటు తప్ప మరే ఇతర డిటర్జెంటు అమ్మబడటంలేదు.

మొన్న మొన్నటిదాకా కర్సన్‌భాయి ఒక కెమిస్టుగా నెలకు రూ. 450 లు జీతం మీద ప్రభుత్వోద్యోగిగా ఉండేవాడు. తీరిక సమ యాలలో ఇతడు కొన్ని రసాయనిక ద్రవ్యాలు చేర్చి తన ఇరుగు పొరుగు వారికి చౌకగా డిటర్జెంటు పౌడరును అమ్ముతూండే వాడు. ఇలా మూడు సంవత్సరాలపాటు కష్టపడి చివరకు నెలకి 500 కి గ్రా.లు అమ్మగలిగాడు. ఆ తరువాత టివిలలోను, రేడియోలలోను, స్థానిక వార్తాపత్రికలలోను ఎక్కువ ప్రచారం చేసాడు. బ్రహ్మాండంగా మహోద్భుతాన్ని సాధించాడు. అదే, నిర్మా!

('ది టీన్ ఏజర్' సౌజన్యంతో)

## మానవులు చరిత్ర నిర్మాతలు

మానవులు చరిత్రను నిర్మిస్తారు. కానీ చరిత్ర మానవులను నిర్మించదు. నాయ కత్వం లేని రోజులలో సమాజం స్థిరంగా ఉంటుంది. చాకచక్యం గల నాయకులు ధైర్యోత్సాహాలతో అవకాశాలను వినియో గించుకుంటూ పరిస్థితులను ఉత్తమరీతిగా మలచినప్పుడే ప్రగతి ఏర్పడింది.

—హరీ ఎస్. ట్రూమన్

## ఆఫ్రికాలో నాలుగు మిలియను హెక్టేరుల అటవీప్రదేశం నష్టం



ఆఫ్రికా ప్రతీ సంవత్సరం నాలుగు మిలియను హెక్టేరుల అటవీ ప్రదేశం నష్ట పోతూంది. గత 100 సంవత్సరాలలో సహారా ఎడారి అంచులలో 150 కి.మీ. పైశాల్యంగల లాభదాయకమైన ఉత్పాదక ప్రదేశం పూర్తిగా విస్తారమైపోయింది. భూమధ్యరేఖకు ఉత్తరంగా 60 శాతానికి పైబడి భూమి సులభంగా ఒరుసుకుపోవ డానికి వాటంగా ఉంది.

('యుఎన్ ఎన్విరాన్‌మెంట్ ప్రోగ్రాం' సౌజన్యంతో)

"ఆకలిగొన్నవానికి భగవంతుడు ఆహారరూపంలో తప్ప సాక్షాత్కరించడానికి సాహసించడు.''

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరుద్వారా పంపండి. —సంపాదకుడు]

1. పి ఎస్.వి. అప్పారావు, 22 సం.లు, ఇం. నెం. 10-102, గోపాలపట్నం పోస్టు, విశాఖపట్నం-530 027.

పజిల్స్ నింపడం, పుస్తకాలు చదవడం, కలంస్నేహం.

2. జి. కోటేశ్వరరావు, బి కామ్, S/o జి. గోవిందయ్య, 9-48, బాలుమురివారి వీధి, వెంకటగిరి టౌన్, (నెల్లూరు జిల్లా) 524 132.

స్టాంపుల - నాణెముల సేకరణ, కలం స్నేహం, ప్రకృతి ఆరాధన.

3. బి. హెచ్. రంగారావు, బి.ఏ., మూడవ సంవత్సరం, కాపవరం, కొవ్వూరు తాలూకా. (ప.గో.జిల్లా) 534 351.

మిమిక్రీ చేయడం, క్రిన్‌మన్ గీతాలను వ్రాయడం.

4. కుమార్ సలేంద్ర వెంకటేశ్వర్లు, S/o కొమరయ్య, ఇం.నెం. 7/21, నకుం పేట, వరంగల్.

కవితలు వ్రాయడం, కలంస్నేహం, నూతన విషయాల సేకరణ.

5. పి. గోవిందరావు బి ఏ., టి.టి.సి, 22 సం.లు., S/o ఎల్లయ్య (సీమెన్) మృత్యురేళం గ్రామం. కళింగపట్నం పోస్టు (శ్రీకాకుళం జిల్లా) 532 406.

జనరల్ నాలెడ్జి, క్రికెట్ ఆడటం, కలం స్నేహం.

6. ఆర్. వెంకటేశ్వర్లు. నాల్గవతరగతి, 10 సం.లు., C/o బి. వెంకట్‌నర్సయ్య, కట్రాపల్లి, రాయపర్తి, వరంగల్ 506 314.

చదరంగం ఆడటం, డ్రాయింగ్, చదవడం.

## 100 మిలియను హెక్టేరుల భూమి నీటి నిల్వవల్ల వ్యర్థమైపోతూంది



భారతదేశంలో గల మొత్తం 328 మిలియను హెక్టేరుల భూమిలో సుమారు 100 మిలియను హెక్టేరుల భూమిమీద నీరు నిల్చిపోయి ఉప్పు చేరడంవల్ల వ్యర్థమైపోతూంది. ఇంకా 12 హెక్టేరుల భూమి సాగు బడి మార్పిడివల్ల, గనులు త్రవ్వకంవల్ల, క్వారీలు త్రవ్వకంవల్ల వ్యర్థమైపోతూంది.



# ఫ్రాన్స్ సంగ్రహ చరిత్ర

యూరప్‌లో 4,807 మీటర్ల మహోన్నతమైన బ్లాంక్ శిఖరంతో కూడిన ఆల్ప్స పర్వతశ్రేణితో 3,200 మీటర్ల తీరరేఖతో, ఫ్రాన్స్ సారవంతమైన విశాల మైదానాలతో, రకరకాల దట్టమైన అడవులతో నిండి ఉంది. ఇక్కడ స హ జ సుందరమైన ప్రకృతి దృశ్యాలు లెక్కలేనన్ని ఉంటాయి. సుమారు 5,51,000 చ.కి.మీటర్ల వైశాల్యం గల ఫ్రాన్స్‌లో వివిధ ఐరోపా దేశాల నైసర్గిక స్వరూపాలన్నీ కనిపిస్తాయి. 2,000 సంవత్సరాలకు పూర్వవైభవ చరిత్రతో, సంస్కృతితో ఫ్రాన్స్ యూరప్‌కు చెందిన మిక్కిలి ప్రాచీన దేశము.




యూరప్‌లో అత్యధిక జనాభా గల దేశాలలో ఫ్రాన్స్ అయిదవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. నేటి ఫ్రాన్స్ జనాభా 54.7 మిలియను. ఫ్రాన్స్‌లో ముఖ్యంగా ఉత్తర మరియు తూర్పుదిక్కు ప్రదేశాలలోను, పారిస్, లయాన్స్ నగరాలలోను జనసాంద్రత అధికం. ఫ్రాన్స్ జనాభాలో ముప్పాతిక శాతం పెద్దపెద్ద పట్టణాలలోను, నగరాలలోను నివసిస్తారు.

ఇక్కడ ఉద్యోగస్థులు 21 మిలియను మందిలో 8 మిలియనుమంది స్త్రీలు. ఇక్కడ పిల్లలకు 16వ సం.రం వయస్సుదాకా విద్య తప్పనిసరి. మొత్తం 8,50,000 మంది యూనివర్శిటీలలో చదువుకుంటారు. 1950వ సం.లో ఉన్న సగటు జీవన ప్రమాణం


GRANVILLE. A FISHING AND SMALL-BOAT PORT ON THE CHANNEL

నేడు రెండు రెట్లు కంటే అధికంగా పెరిగింది. ప్రపంచంలో ఇది మిక్కిలి అధికం

## పాఠకుల అభిప్రాయాలు

"గణితంలో సున్నవిలువ అమితం,
జీవితంలో గతంవిలువ అనంతం."
—వాసా రామలింగేశ్వరరావు,
రామచంద్రపురం.

* * *

"హితమైన మాటలెప్పుడు ప్రియంగా ఉండవు,
ప్రియమైన మాటలెప్పుడు హితాన్ని చేకూర్చవు."
-కొండూరు చంద్రశేఖర్, గుంటూరు

"ప్రకృతిని ఎదిరించి నిల్చుటయే ఆత్మధర్మము.
ప్రకృతి దాస్యమే దుస్థితికి హేతువు."

సాంప్రదాయకంగా వ్యవసాయ వృత్తి ముఖ్య ఆధారంగా గల ఫ్రాన్స్ వ్యవసాయక ఉత్పత్తులే EEC కామన్ మార్కెట్‌లో సగానికి సగం ఉంటాయి. ఫ్రాన్స్ వివిధ ధాన్యాలు, చెరకు, బీటు, బీఫ్ మాంసము, పాలు, వైన్ మొదలైన వస్తువులన్నిటినీ EEC కామన్ మార్కెట్‌కి సరఫరాచేస్తుంది. దీని వ్యవసాయ మరియు ఆహార వస్తువులు, ఇతర పానీయాలు ఫ్రెంచి ఎగుమతులలో ఠీవ వంతు.


THE ARTS FACULTY IN REIMS

పారిశ్రామిక రంగంలో ఫ్రెంచి సాంకేతిక పరిజ్ఞానం బ్రహ్మాండమైన ఫలితాలను సాధించింది. ముఖ్యంగా ఇనుము, ఉక్కు పరిశ్రమలలోను, ఇంజనీరింగ్ ఇండస్ట్రీస్ లోను ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్, ఇంజనీరింగ్, రసాయనిక పరిశ్రమలలోను అనేక ఉత్తమ ఫలితాలను సాధించింది.

ఫ్రెంచి సివిల్ ఇంజనీరింగ్ సంస్థలు కాలువలు, డాములు, బ్రిడ్జీలు, సొరంగాలు, నౌకాశ్రయాలు, ఓడరేవులు, విమానాశ్రయాలు మొదలైనవాటిని ప్రపంచంలో సుమారు 100 దేశాలకు నిర్మిస్తుంది.

ప్రపంచంలో ఎలక్ట్రికల్ లోకో మోటివ్‌లను ఉత్పాదించే దేశాలలో ఫ్రాన్స్ చాలా ముఖ్యమైనది. డీసెల్ లోకోమోటివ్‌ల ఉత్పాదనకు ఫ్రాన్స్ ద్వితీయ స్థానం పొందుతుంది. ఇటీవల గాస్‌టర్బైనుల ఉత్పాదనలో సాంకేతికాభివృద్ధి పొందింది

వాయు విమాన మరియు అంతరిక్ష పరిశ్రమ బ్రిటిష్‌వారి సహాయంతో సూపర్ సోనిక్ కాంకోర్డ్ నిర్మిస్తుంది. చిన్న చిన్న వ్యాపారస్తులకు ప్రైవేట్ విమానాలను సరఫరా చేస్తుంది. ఎయిర్‌క్రాఫ్ట్ ఉత్పాదనలో ఫ్రాన్స్ ప్రపంచంలో తృతీయ స్థానాన్ని పొందింది. ప్రపంచం అంతటా 90 దేశాలకు ఫ్రాన్స్ 40 శాతం ఉత్పాదనలను సరఫరా చేస్తుంది. ప్రైవేట్ కార్లు మరియు వ్యాపార వాహనాల తయారీలో ఫ్రాన్స్ ప్రపంచంలో నాల్గవ స్థానాన్ని పొందింది ఫ్రాన్స్ సంవత్సరానికి సగటున సుమారు 100 దేశాలకు 15,00,000 కార్లను ఎగుమతి చేస్తోంది. ప్రపంచంలో ఉత్పాదింపబడే ప్రతీ 10 కార్లలో ఒకటి ఫ్రెంచి తయారీ. పనిచేసే అయిదు రోజులలో రెండురోజుల తయారీ ఎగుమతి చేస్తుంది.

న్యూక్లియర్ ఫిజిక్స్, ప్యూర్ మరియు అప్లైడ్ మాథమాటిక్స్, మాగ్నటిజమ్ సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, ఎలక్ట్రానిక్ ఆప్టిక్స్ వంటి వివిధ వైజ్ఞానిక రంగాలలో ఫ్రాన్స్ ప్రపంచ ఖ్యాతిని గడించింది. యునైటెడ్

## భారతదేశంలో 65,000 జంతు జాతులు

భారతదేశం జీవవైవిధ్యంతో సమృద్ధిగా ఉంటుంది. ఇక్కడ 45,000 వృక్షజాతులు, 65,000 జంతుజాతులు ఉన్నాయి.

"అలవాట్లు మొదట్లో సాలెగూళ్ళు, [illegible] గొలుసులు."

నేషన్స్, యునెస్కో ఇతర ప్రపంచ సంస్థలు ఉపయోగిస్తున్న అయిదు ముఖ్య భాషలలో ఫ్రెంచి ఒకటి. ఫ్రెంచి భాష 31 దేశాలలో మాట్లాడతారు. ఫ్రెంచి భాషా సంస్కృతి సాటిలేనిది.


THE NSRC'S ELECTRONIC OPTICS LABORATORY AT TOULOUSE

1958వ సంవత్సరపు రాజ్యాంగ చట్టమును అనుసరించి ప్రతీ పౌరుడు సమానమైన పౌరహక్కులు మరియు స్వాతంత్ర్యం కలిగి ఉంటాడు. ఫ్రెంచి దేశపు ముఖ్య పాలనాధికారి ప్రెసిడెంట్ ఆఫ్ ది రిపబ్లిక్. ఇతడు 7 సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడతాడు. ఇతడే ప్రధాన మంత్రిని నియమిస్తాడు. ప్రధానమంత్రి సలహామీద ఇతర మంత్రులు నియమింపబడతారు. పార్లమెంటులో నేషనల్ అసెంబ్లీ, సెనేటు చేరి ఉంటాయి. నేషనల్ అసెంబ్లీలో 490 డిప్యూటీ సభ్యులు 5 సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడతారు. సెనేటులో 283 సభ్యులు 9 సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడతారు.

ఫ్రాన్స్ మెయిన్ లాండ్‌లో 95 వివిధ డిపార్ట్‌మెంట్‌లతో కూడిన 38 000 మునిసిపాలిటీలు ఉన్నాయి. ఇది 22 మండలాలుగా విభజింపబడ్డాయి.

(6 వ

విష్ణువు దిగ్గన లేచి గజప్రాణావనోత్సాహియై ఏ పరివారం లేకుండా వేడుక చూడడానికా అని శ్రీనాథుడు ఆక్షేపించాడు. దానికి పోతన ఊరకుండి ఒకనాడు శ్రీనాథుడు ఒంటినిండా నూనె రాసుకుని తలంటుకోడానికి సిద్ధంగా ఉండగా నూతిలో ఒకపెద్ద రాతిబండను వేసి పోతన పరుగెత్తి పిల్లాడుకు నూతిలో పడిపోయాడని శ్రీనాథునితో చెప్పాడు. వెంటనే శ్రీనాథుని గుండె జల్లుమని నూనె కారుతున్న ఒంటితో, విరబోసుకున్న జుట్టుతో నూతి దగ్గరకు పరుగెత్తి వచ్చి నూతిలో తొంగి చూస్తున్నాడు. వెంటనే పోతన 'ఇదేమిటి శ్రీనాథా! నిచ్చెనలేదు, త్రాళ్ళులేవు. నూతిలో దిగడానికి మనుషులు లేరు. ఊరికే వేడుక చూడడానికి వచ్చావా?' అని పరిహాసం చేసి ఆతురతతో, పుత్రవాత్సల్యంతో ఏ సాధన సదుపాయం లేకుండా నీవు ఎలావచ్చావో అలాగే నా విష్ణువు భక్తుని మొరవిన్న వెంటనే పరుగెత్తి వచ్చాడు' అన్నాడు. ఇటువంటి కథలు భక్తులు ఎన్నెన్నో చెప్పుకుంటారు

భాగవతం తెలుగువారికి ప్రాణప్రియమైన ప్రబంధం. భాగవత పద్యాలన్ని ఇతర పద్యాలు నోటికి వచ్చినవారు చాలామంది లేరు. పోతన ముముక్షువు. మహాకవి. మహాయోగి. సహజపండితుడు. శ్రీరాముని సాక్షాత్కారం పొందినవాడు. తెలుగువారి ఇంటింట భాగవతము నెలకొని ఉండటానికి కారణము అందలి భక్తిరస సౌగంధ్యము, పద్య శిల్పకళా సౌందర్యము. సాహిత్యోద్యానంలో పోతన కవీంద్రుడు నాటిన పారిజాతము ఆంధ్ర మహాభాగవతము

సత్కార్యమును సుఖమునకును మధ్య

# బ్రిటన్‌లో సైన్స్ పార్కులు

సాంకేతిక విజ్ఞానంపై ఆధారపడిన కంపెనీల సమూహమే సైన్స్ పార్కులు. ఇవి యూనివర్శిటీలకు మరియు అటువంటి విద్యాసంస్థలకు చేరి ఉంటాయి. ఈ యూనివర్శిటీ మరియు విద్యాసంస్థలలో జరిగే పరిశోధనా ఫలితాలను వ్యాపారరీత్యా ఉపయోగపడడానికి సహకరిస్తాయి. 1987 వ



సం. రం. వేసవికి ఇటువంటి సైన్సు పార్కులు బ్రిటనులో 30 ఉన్నాయి. పరిమాణమునుబట్టి, నెలకొల్పబడిన స్థానమును బట్టి, అక్కడ చేరిన వినియోగదారుల అవసరాలను బట్టి ఇవి వివిధ రకాలుగా ఉంటాయి. అయినప్పటికి ఇవి విజ్ఞానాభివృద్ధికి సాంకేతిక విజ్ఞానంపై ఆధారపడిన సంస్థలకు ప్రోత్సాహకరంగా ఉండి ఉత్తమ విద్యారంగాలలో నైపుణ్యాలను సైన్స్ పార్కులలో నెలకొన్న సంస్థలకు వినియం చేస్తాయి. బ్రిటన్‌లో మొట్టమొదటి సైన్స్ పార్కులు 1970 వ సంవత్సరంలో ఎడిన్‌బరోలో హిరాయిట్ - వాట్ యూనివర్శిటీలోను, కేంబ్రిడ్జిలో ట్రినిటీ కాలేజీలోను స్థాపింపబడ్డాయి.

1986 వ సంవత్సరాంతంలో బ్రిటన్ సైన్స్ పార్కులలో ఏర్పడిన 400 మంది వినియోగదారులలో సగంకంటేఎక్కువమంది కంప్యూటర్ మరియు ఎలక్ట్రానిక్స్‌లోను, 12 శాతం బయోకెమిస్ట్రి మరియు కెమిస్ట్రిలోను, 19 శాతం కన్సల్టెన్సీ మరియు ట్రెయినింగులోను, 9 శాతం ఆర్థిక మరియు ఇతర వ్యాపార సేవలలోను నైపుణ్యమైన వైజ్ఞానిక సహకారాన్ని పొందారు.

('బ్రిటిష్ ఇన్‌ఫర్మేషన్ సర్వీసెస్' సౌజన్యంతో)

## మీరైతే...?

(జూన్

('వ్యక్తిత్వానికి మనసే అద్దం' అంటే?)

"మనసును మించిన ముకురం మరొకటి లేదంటాను."

—బి. రాజ్‌కుమార్, సుబేదారి

* * *

"బింబం బాగుండాలంటే అద్దాన్ని శుభ్రపరుస్తుండాలి."

—డి. జి. శంకర శ్రీనివాస్, గంగచోళ్ళపెంట.

* * *

"అద్దాల వ్యాపారానికి గడ్డుకాలం వస్తుంది."

—ఎ. గీతాంజలి, మచిలీపట్నం

వ్యక్తిత్వమునను పైనను దౌర్బల్యమునకు అవకాశము గౌరవము..

# యోచనాపరంపర

బబితా మల్హోత్రా

స్వర మాధుర్యం లేకుండా సంగీతం రాణించదు. అసలు సంగీతం పాడలేం.

స్వార్థపరత్వం అనే మానసిక జాడ్యానికి 'నేను' అనేదే మూలకారణం.

కోపమువల్ల మనస్సుకు నిలకడ ఉండదు. కలతచెంది పోతుంది. నెమ్మది ఉండదు. మనస్సుకు నెమ్మది లేకపోవడంవల్ల, పనికి




మాలిన యోచనలవల్ల మానవుడు అయోగ్యుడవుతాడు. భగవంతుని ప్రపంచంలో జీవించడానికే తావు ఉండదు.

ప్రార్థన లేక ధ్యానంవల్ల శాంతి లభిస్తుంది. శాంతివల్ల ముక్తి, మోక్షం ప్రాప్తిస్తుంది. ధ్యానం లేక యోచన వలన చైతన్యత ప్రభవిస్తుంది. చైతన్యతవల్ల క్రియ జరుగుతుంది. క్రియాసాధనవల్ల జీవితం సార్థకం అవుతుంది.

మౌనంవల్ల ఆవేశాలు ఉండవు. హృదయాన్ని గాయపరచే పలుకుల కాఠిన్యం ఉండదు. దీనివల్ల ఒక క్షణం ఆత్మావలోకనానికి అవకాశం కలుగుతుంది. ఆత్మావలోకనంతో భగవంతుని దర్శించుకోగలుగుతాము.

ఒక్కసారి అద్దంలో చూసుకుంటే ప్రతిబింబాన్ని చూసుకోవచ్చు. జీవితం అనే అద్దంలో మన ప్రతిబింబాన్ని మనం చూసుకోలేక పోతున్నాం. ప్రకృతి ద్వారా భగవంతుడు మనతో సంభాషిసాడు.

## సుభాషితాలు

తను వలచిన దావలచును
తను వలవక యున్న నెవడు తావలవడిలన్
తనదు పటాటోపంబులు
తన మాయలు పనికిరావు ధరలో వేమా!

[తాను ఇతరులను ప్రేమిస్తే వారు తన్ను ప్రేమిస్తారు. తాను ప్రేమింపకున్న వారును ప్రేమింపరు. మోసంచేస్తే ఎవ్వరూ ప్రేమిం

వెదక వెదక దొరుకు వేదాంత వేద్యుండు
వెదకువాని దాను వెదకుచుండు
వెదుక నేర్చునట్టి నెరవర్లు గలరొకో
విశ్వదాభిరామ వినురవేమా!

[ప్రయత్నించి వెదుకుతే భగవంతుడు దొరుకుతాడు. తన్ను వెదకు వానిని ఆ భగవంతుడు వెదుకుతూంటాడు. కానీ భగవంతుని వెదకు ఉపాయము తెలిసినవాడు చాలా తక్కువ.]

'ఒక్క యథార్థ వాక్యానికున్న బలం వెయ్యి నీతి వాక్యాలకు ఉండదు.'

**పెద్ద పెద్ద ఓడరేవుల నుంచి 120.04 మిలియను టన్నుల సరకు రవాణా అవుతుంది:**

భారతదేశంలో పెద్ద పెద్ద ఓడరేవులలో 1985-86 వ సం లో అత్యధికంగా 120.04 ఏను టన్నుల సరకు రవాణా అయింది. ఒకే సంవత్సరంలో ఇంతవరకూ ఇంత అధికంగా రవాణా జరుగలేదు.

**భారతదేశంలో 9,000 టన్నుల చాక్లెట్ల ఉత్పత్తి:**

భారతదేశం సాలీనా సుమారు రూ. 75 కోట్ల విలువజేసే 9,000 టన్నుల చాక్లెట్లను ఉత్పత్తి చేస్తూంది. చాక్లెట్ల మార్కెట్ల పెరుగుదల ప్రమాణం సుమారు 25 శాతం.

* * *

**లెటర్ రైటింగ్ పోటీలో పీటర్ థామస్‌కి మొదటి బహుమానం:**

యూనివర్సల్ పోస్టల్ డిపార్టుమెంటువారి ఆధ్వర్యంలో 15 వ ఇంటర్‌నేషనల్ లెటర్ రైటింగ్ పోటీలో కేరళకు చెందిన పీటర్ థామస్ ప్రథమ బహుమతిని గెలుచుకున్నాడు.

'శాంతిస్థాపనకు పోస్టువారి బాధ్యత' అనే విషయాలపై ఒక శరణార్థుడైన బాలునికి ఉత్తరం వ్రాయమన్నారు.

* * *

**స్విట్జర్‌లాండ్‌లో 'సీక్రెట్ అకౌంట్' తెరవాలంటే:**

స్విట్జర్‌లాండ్ బాంకులో సీక్రెట్ అకౌంట్ తెరవాలంటే మొట్టమొదట ఖాతాదారుడు తన ఐడెంటిటీని ధృవపరచుకోవాలి. సీక్రెట్ అకౌంట్ ఉండాలంటే ఖాతాదారుడు 2,00,000 స్విస్ ఫ్రాంకులు బాంకులో జమ చేయాలి.

వ పేజీ తరువాయి)

విషపాము కరచిన వారికి మరణం తప్పించడానికి విషాన్ని తటస్థవంతం చేసే ఆంటీవెనిన్ (antivenin) ఒక్కటే శరణ్యం. రోగిని హాస్పటల్‌కు తరలించే ముందు గమనించవలసిన కొన్ని సూచనలు:

1. రోగిని కదపకుండా ఉంచాలి.
2. రోగికి ధైర్యం కలిగించాలి.
3. ప్రథమ చికిత్స చేయాలి.
4. వైద్యుని వెంటనే సంప్రతించాలి.
5. భయపడి పోపీయవద్దు.
6. ఏమీ త్రాగనీయవద్దు.
7. బాధానివారక ఔషధాలుగానీ, మార్ఫిన్ గానీ వాడకూడదు.

[illegible] కోరుతుంది. తల్లి నా భాగ్యాన్ని [illegible] వేడుకలను [illegible]

మూడు సంవత్సరాలలో 402 పౌండ్లు తగ్గుదల:

యుఎస్ఎ కాలిఫోర్నియాలో బాగా లావెక్కిన వాండా జోర్క్ అనే ఆమె మూడు సంవత్సరాలలో 541 పౌండ్లనుంచి 139 పౌండ్ల భారానికి తగ్గిపోయింది.

* * *

శిక్కులకు తప్పనిసరి:



శిక్కులకు అందరికీ ఒక ఉక్కుదువ్వెన, కత్తి, కంకణం ముఖ్యంగా ఉండాలి.

* * *

3½ కి.గ్రా.ల కుక్కగొడుగు:

జెకోస్లేవేకియాలో దుసాన్ మిఖాలెకా అనే ఒక విద్యార్థి 3½ కి.గ్రా. బరువు తూగే కుక్కగొడుగును (మష్‌రూమ్) కనుగొన్నాడు. —'మిషా' సౌజన్యంతో

* * *

బంగ్లాదేశ్‌లో 5 మిలియను ఎలుకలు చంపబడ్డాయి:

బంగాదేశ్ రెండు సంవత్సరాల క్రితం చేపట్టిన గోధుమ మరియు ధాన్యం సంరక్షణోద్యమంలో 5 మిలియను ఎలుకలు చంపబడ్డాయి. ఈ ఎలుకలవల్ల ప్రతీ సంవత్సరం 1.4 మిలియను టన్నుల ధాన్యం, గోధుమ నష్టమైపోతూంది.

* * *

ఆటోమాటిక్ కాసెట్ల నిరంతర మార్పిడి విధానం:

ఉత్తరప్రదేశ్ ఆగ్రాలో అరుణ్ ప్రతాప్ సింగ్ అభివృద్ధిచేసిన నిరంతర ఆటోమాటిక్ కాసెట్ మార్పిడి విధానంలో 6 లేక అంతకంటే అధికంగా కాసెట్లు ఒకదాని తరువాత మరొకటి ప్రతిది ఎ,బిసైడ్లతో సహా వాటంతటవే మారుతూంటాయి. ఆఖరి కాసెట్ తిరగడం ఆగిపోయిన వెంటనే మొదటి కాసెట్ తిరిగి తిరగడం ప్రారంభిస్తుంది. ఈ విధంగా నిరంతరం కాసెట్లు వాటంతటవే తిరుగుతూనే ఉంటాయి.

* * *

అడయారు గ్రంథాలయంలో 20,000 లిఖిత గ్రంథాలు:

మద్రాసు అడయారు లైబ్రరీ మరియు పరిశోధక కేంద్రంలో 20,000 తాళపత్ర గ్రంథాలు, కాగితపు గ్రంథాలు ఉన్నాయి.

## పెద్ద నత్త

పాల్ట్రామెల్లే అనే ఫ్రెంచి దేశీయుడి దగ్గర ప్రపంచంలో మిక్కిలి పెద్ద నత్త ఉంది. దీని వయస్సు 5 సంవత్సరాలు. బరువు 1½ కి.గ్రా. లు ఆఫ్రికానుంచి వచ్చిన పెద్ద ఓడలో దీనిని కనుగొన్నారు.

—'మిషా'

"అమృతము లభించినను ముసుగునీటికి నోరు తెరవ దగునా?"

తోరుదత్.

ఆంగ్లభాషలో అపూర్వమైన కవితలు వ్రాసి ప్రసిద్ధిపొందిన మొదటి బెంగాలీ మహిళ. ఈమె రచించిన 'ఏన్షియంట్



బాలడ్స్ అండ్ లెజెండ్స్ ఆఫ్ హిందుస్థాన్' అతి సులభశైలిలో ఉంటుంది. కాషురినా ట్రీ (సరుగుడు చెట్టు)ని వర్ణిస్తూ ప్రప్రథమంగా ఆంగ్లేయులకు పరిచయం చేసి వ్రాసిన ఈమె పద్యాలు మిక్కిలి ఆహ్లాదకరంగా ఉంటాయి.

* * *

ఎలిజబెత్ టేలర్:

ప్రపంచం అంతా పేరుమోసిన సినీమా నటి. 'నేషనల్ వెల్వెట్' అనే చిత్రం ఈమెను ఒక అపూర్వ నటిగా తీర్చిదిద్దింది. క్లియోపాత్ర పాత్రను పోషించడానికి 20 వ సెంచరీ ఫాక్స్ వారి దగ్గర ఒక మిలియను డాలర్లను పుచ్చుకుంది. ఈమె ఆస్థి అపూర్వ కళావస్తువులు, ఆభరణాలు విలువ దాదాపు 20 మిలియను డాలర్లు. ఇప్పుడు ఈమె పూర్తిగా తన కాలాన్ని, ధనాన్ని ఎయిడ్స్ (Aids) పరిశోధనకు, ఇతర పునరావాస ఉద్యమాలకు వెచ్చిస్తూంది.

డా. టి.ఎమ్.ఎ. పాయి:

గొప్ప వైద్యుడు, విజ్ఞాని, దయామయుడైన లోకోపకారి, బాంకర్, పారిశ్రామిక వేత్త, మానవతావాది. కర్ణాటక మణిపాల్‌లో 1,100 పడకల వసతిగల కస్తూర్బా హాస్పిటల్ స్థాపించాడు. ఇచ్చట రోగులకు అన్ని ఆధునిక సౌకర్యాలు కల్పించబడ్డాయి. భావి భారత పౌరుల జీవితాలను తీర్చిదిద్దడానికి 36 సంస్థలను స్థాపించాడు.

* * *

ఆచంట రుక్మిణమ్మ (1891-1951)

మధురలో ఉగ్గెళ్ళ శ్రీనివాసరావు గారి కుమార్తె డా. ఆచంట లక్ష్మీపతి గారిని



ప్రేమించి వివాహం చేసుకుంది. 1911 వ సం.లో ఈమె భారతీయ మహిళా మండలి కార్యదర్శిగా ఉంటూ మౌంటురోడ్డులో స్వదేశీ స్టోర్స్‌ను మహిళామండలి తరపున స్థాపించింది. 1926 వ సం.లో పారిస్‌లో జరిగిన ఇంటర్ నేషనల్ ఉమెన్స్ సఫ్రేజి ఎలైన్స్ కాంగ్రెస్ సభకు భారతదేశపు ప్రతినిధిగా వెళ్ళింది. 1930 సం. రంలో జరిగిన వేదా

(మిగతా 53 వ పేజీలో)

చీకట్లోనుండి వెలుగులోకి
వచ్చేటప్పుడు దగ్గర దారులు, సులభోపాయాలు లేవు.

# తాళంచెవి పెత్తనం

కోసూరి శీలామాధవ్

లోకంలో మానవుడు ప్రత్యాశతో, అభిలాషతో జీవిస్తాడు ఇటువంటి మానవుని మనస్సులో 'నేను' 'నాది' అనే భావం పొటమరిస్తుంది 'తనది' 'తనవి' అని కొన్ని వస్తువులు చేర్చి పెట్టుకుంటాడు. ధనాన్ని కూడబెట్టుకుంటాడు. వీటితో ఎక్కడలేని సంతోషంతో, ఆనందంతో మురిసిపోతూంటాడు. ఇల్లు కట్టుకుంటాడు. పొలం సంపాదిస్తాడు. తన ఇంట్లో ఎవరూ ప్రవేశించకుండా భద్రంగా తాళం వేసుకుంటాడు. తన పొలానికి అడ్డుకంచెలు, అడ్డుగోడలు నిర్మించుకుంటాడు. పోటీ ప్రవృత్తి పెరిగిపోవడంచేత తనకులేని అపురూపమైన వస్తువాహనాలను ఆర్జించుకుని వాటిని 'తనవిగా' చేసుకోవాలనే ఉబలాటం పెరుగుతుంది. ఆర్జించుకుంటాడు. మమకారం, స్వార్థపరత్వం. అసూయ, దురాశ, అహంకారం, ధనాశ, భోగలాలస పెచ్చు పెరిగి 'తనవి' అనుకున్న వసువులను పెట్టెలో పెట్టి దానికి మూతవేస్తాడు పెట్టె మూతకు నాగవాసంతో గొళ్ళెం తగిలించి పైవాళ్ళెవరూ మూతతీసి వీటిని సులభంగా జిక్కించుకోకుండా ఒక ఇనుపదో, కంచుదో బీగం బంధిస్తాడు. ఈ బీగాన్ని బంధించడానికిగానీ తెరవడానికిగానీ ఒక సాధన తన చేతిలో పెట్టుకుంటాడు. ఇదే తాళంచెయ్యి లేక తాళంచెవి.

కాలం మారుతూన్నకొద్దీ, విజ్ఞానం పెరుగుతూన్నకొద్దీ, అణుయుగం, అంతరిక్ష యుగం, కంప్యూటర్ యుగం— ఎన్నెన్నో యుగాలు మారిపోతున్నాయి. ఇప్పుడు తాళం చెవుల యుగంలోకి వచ్చేసాం. కొన్నేళ్ళ క్రితం ఏదో రెండు మూడు తాళాలతో ఒక చిన్న గుత్తి పెట్టుకునేవారు ఇప్పుడు అనేక తాళాలతో అనేక తాళంచెవి గుత్తులు పెట్టుకోవలసి వస్తూంది. జీవితం అంతా తాళాలు, తాళపు గుత్తులతో సతమతమైపోతూంది.

స్వంతఇంట్లో ఉన్నా, అద్దెఇంట్లో ఉన్నా చివరికి ఫ్లాట్ లో ఉన్నా వీధి తలుపు (ముఖద్వారం) తాళంచెవి, హాలు తాళంచెవి. పడకగది తాళంచెవి, వంట ఇంటి తాళంచెవి,

## మేలును మించిన ం లేదు




ఇతరులకు మేలుచేయడం కన్నా పవిత్రమైన ధర్మం లేదు. ఇతరులకు కీడుచేయడం కన్నా పాపకార్యంలేదు. సుప్రతిష్ఠమైన సదాచారం గలవారికి ఈ ప్రపంచంలో సాధించలేనిది లేదు. —గోస్వామీ తులసీదాసు

"ప్రపంచం కరుణలో పుట్టి కరుణలో పెరిగి కరుణలోనే విలీనమౌతుంది."

స్నానాలగది తాళంచెవి, దేవుడిగది తాళం చెవి ఒకటేమిటి ఎన్నో! ఇక లోపల అల మారాల తాళంచెవులు, గాద్రెజ్ తాళాలు, లాకర్ తాళాలు. పూర్వం ఇనపపెట్టె తాళాలు, సొరుగుల బీరువా తాళాలు మాత్రమే ఉండేవి.

ఇక స్కూటర్‌గానీ, మోటార్‌బైక్ కానీ ఉంటే వీటి తాళాలన్నీ ప్రత్యేకంగా మరో గుత్తి. స్కూటర్‌కి తాళం. డిక్కీకి తాళం, పెట్రోలు టాంకుకి తాళం. ఇలాగే కారుంటే మరో తాళాలగుత్తి.

ఆఫీసులో పనిచేస్తూంటే ఆఫీసు తలుపు తాళం. లోపలి బీరువాతాళం, బల్లతాళం ఇవన్నీ మరోగుత్తి.

ఎక్కడికి వెళ్ళినా, ఎక్కడ చూచినా ఈ తాళాలగుత్తులే వెంట తరుముతూంటాయి. ఇవి అందరికి ఉపద్రవం కలిగించవు. దర్జాగా బట్టలు వేసుకుని, ఈలవేసుకుంటూ చేతి వ్రేళ్ళతో తాళపుగుత్తి త్రిప్పుతుంటే ఆ గొప్పతనమే వేరు. ఆ ఠీవే వేరు. వేరే చెప్పాలా! ఒక విధమైన అధికారం, అహం కారం, గర్వం ముఖంమీద తాండవిస్తుంది. తాళాలను రక్షించుకుంటే తాళాలు నిన్ను రక్షిస్తాయి. ఒకసారి పోగొట్టుకుంటే పడే అవస్థ ఇంతా అంతా కాదు. చెప్పకుండా చేతిలోనుంచో, జేబులోనుంచో జారిపో తూంటాయి. అందుచేత డూప్లికేటు తాళాల గుత్తులు ఉంచుకుంటారు. తాళాలగుత్తులో ఎన్నైనా తాళాలు ఉండవచ్చు. ఎన్ని తాళాల గుత్తులైనా ఉండవచ్చు. కాని ఒక్కటే తాళంచెవి అన్ని తాళాలతోను సరిసమా నంగా ఉండి అన్ని తాళాలను తెరిచేస్తుంది. ఇదే 'మాస్టర్ కీ'

తాళంకోసం తాళంచెవులు తయారు చేయవలసి వచ్చింది. ఈ తాళం చెవులు పొందికగా పెట్టుకోడానికి రింగులు తయారు చేయవలసి వచ్చింది. రింగు తగిలించుకో డానికి గొలుసులు వెండివి, స్టీలువి రక రకాలు.

అసలు విషయం ఏదైనా తాళంచెవి నీ చేతిలోఉందా! కిటుకు అంతా నీలో ఉందన్న మాటే. అధికారానికి చిహ్నం తాళంచెవి. చీరకొంగుకు పెద్ద ఘోషాణం తాళంచెవి కట్టుకుని తాళాలరింగు పెట్టిన గొలుసు మొలలో వ్రేలాడుతూ కోడలికి పనులు పురమాయించే అత్తగారి అహంకారం చెప్పాలా? కొందరి ఇళ్ళల్లో కోడళ్ళు రావడంతోటే తాళపు గుత్తులు చేతులు మారిపోతాయి కోడలి చేతిలోకి వచ్చేస్తాయి తాళాలు. పెత్తనం కూడా మారిపోతుంది. కోడలిదే పెత్తనం అవుతుంది.

ప్రాణాలకు కూడా స్వంత తాళాలంటే ఎంతో తీపి, మమకారం. మరణావస్థలో ఉన్నవారి చేతిలో ఒక్కసారి వారి తాళపు గుత్తి చేతిలో పెడితేగానీ ఆ ప్రాణాలు సుల భంగా వదలవు. ఇంకా గట్టి ప్రాణాలకు ఒక్కసారి తాళాలను సానమీద నీళ్ళలో అరగదీసి ఆ నీళ్ళను నోట్లోపోస్తారు!

వాస్తవంగా ఎంత గట్టి తాళాలైనా ఇట్టే తీసివేయవచ్చు. ఎంతెంత పెద్ద గట్టి అడ్డు గోడలైనా ఇట్టే పడగొట్టవచ్చు.

## భారతదేశంలో పార్సీలు

భారతదేశంలో పార్సీలు లక్షకు పైగా ఉన్నారు.

## సోవియెట్ యూనియన్ మాప్ అద్వితీయం

మాస్కో మధ్యప్రదేశం అంత వైశాల్యంగల అద్వితీయమైన సోవియెట్ యూనియన్ మాప్ కార్టొగ్రాఫర్స్‌చే సృష్టించ బడింది. నగరాలు, పట్టణవాసాల నిర్మాణానికి ఇది అత్యంత ఉపయోగకరం ఈ మాప్‌లో ఒక సెంటీమీటరు 250 మీటర్ల భూభాగాన్ని సూచిస్తుంది.

## 1986 వ సం. లో అస్సాంలో 2,341 ఆత్మహత్యలు

1986 వ సం.లో అస్సాంలో ఆత్మ హత్యలు విపరీతంగా 2,341కి పెరిగిపోయాయి. 18 నుంచి 30 సంవత్సరాల వయస్సులో ఉన్న వారిలో ఆత్మహత్యలు మిక్కిలి ఎక్కువ. భారతదేశంలో 1977 వ సం. దాకా అస్సాంలో ఆత్మహత్యలు అసలు చాలా తక్కువ.

## "బాకున్‌డామ్" వల్ల సంభవించే నష్టం

మలేషియాలో బాకున్‌డామ్ సుమారు సింగపూర్ అంత వైశాల్యంగల ప్రదేశాన్ని నీటిలో ముంచేస్తుంది. అక్కడ నివసించే 4,000 మంది తమ అసమ్మతిని ప్రకటించినా రూ. 130 బిలియన్ల ఖర్చుతో సారవాక్ రాష్ట్రంలో జలవిద్యుత్‌ను జనింపజేయడానికి ఇది నిర్మింపబడుతుంది. ఈ ప్రదేశం వదలి పెడితే వారికి రూ. 1,170 మిలియను నష్ట పరిహారం ఇస్తారు. అయినా వారి సంస్కృతి, వారి భూమి వారికి ఎన్నటికీ దక్కవు.

—'సిఇఇఇ-ఎన్‌ఎఫ్‌ఎస్' సౌజన్యంతో

## యుఎస్‌ఎలో అక్షరాస్యత 99 శాతం

యుఎస్‌ఎలో తలసరి వార్షిక ఆదాయం 12,000 డాలర్లు. ఇక్కడ అక్షరాస్యత 99 శాతం. 124 మిలియనుకు పైబడి మోటారు వాహనాలు ఉన్నాయి. పురుషుల జీవిత ప్రమాణం 71.6 సం. లు. మహిళల జీవిత ప్రమాణం 76.3 సం.లు. సుమారు 80 శాతం అమెరికనులు పెద్ద పెద్ద నగరాలలోనే జీవిస్తారు.

## ఆఫ్రికాలో మిక్కిలి పెద్ద 'ఓపెన్ ఎయిర్ జూ'



నైరృతి ఆఫ్రికా నమీబియాలోని మిక్కిలి పెద్ద అరుబియాలు జంతుశాల 78,000 చదరపు మైళ్ళ వైశాల్యం ఉంటుంది.

"మనిషన్న ప్రతివాడూ నిజాన్ని తెలుసుకోవాలి. నిజం తెలుసుకుని తెలివిగా మసలుకోవాలి."

## 1989 వ సం. రం. నాటికి బాన్‌కి 2000 సం. లు నిండుతాయి

ఫెడరల్ రిపబ్లిక్ జర్మనీ ముఖ్యపట్టణ మైన బాన్‌కి 1989వ సం.రం. నాటికి 2000 సంవత్సరాలు నిండుతాయి. 3,00,000 జనాభా గల ఈ పట్టణం రోమ్ సామ్రాజ్యంతో సంబంధం, గత వైభవం స్మరింపుకుంటుంది.

## పంజాబు 25 శాతం ట్రాక్టర్లు ఉపయోగిస్తుంది

మొత్తం భారతదేశం వైశాల్యంలో పంజాబు వైశాల్యం 1.53 శాతం. అయినా మన దేశంలో ఉన్న మొత్తం ట్రాక్టర్లలో 25 శాతం, మొత్తం గొట్టపు బావులలో 8 శాతం ఈ రాష్ట్రం ఉపయోగించుకుంటుంది.

## గర్భపోషక ఔషధాలు సేవించి 7 మంది పిల్లలను ప్రసవించింది

గర్భపోషక ఔషధాలు సేవించిన ఒక వనిత ఇంగ్లండ్ లివర్‌పూల్ మెటర్నిటీ హాస్పిటల్‌లో ఏడుమంది పిల్లలను ప్రసవించింది. నెలలు నిండకుండా ముందుగానే సిసేరియన్ ఆపరేషన్‌తో ప్రసవించిన బిడ్డలు సుమారు 453 గ్రాములు బరువు తూగారు.

## త్రాగే మంచినీటిలో ఇనుము అత్యధికం

ఈశాన్యప్రదేశాలన్నిటికంటే త్రిపురాలో త్రాగడానికి లభించే నీటిలో ఇనుము అత్యధికంగా - లీటరుకి 18 మిల్లీగ్రాములు ఉంది సాధారణంగా 0.3 మొదలు 1 మిల్లీగ్రాము అనుమతింపబడిన పరిమితి.

## సముద్ర న్యాయ విచారణకు అంతర్జాతీయ న్యాయసభ

ఇకనుంచి సముద్ర న్యాయవిచారణకు అంతర్జాతీయ న్యాయసభ హాంబర్గ్‌లో జరగడానికి యునైటెడ్ నేషన్ సమావేశంలో సూచింపబడింది. జర్మనీలో యునైటెడ్ నేషన్స్ సంస్థ ఏర్పడడం చరిత్రలో ఇదే ప్రప్రథమం.

## దక్షిణ పసిఫిక్ మహాసముద్రం రాతిగుట్టలలో 'రాకాశి నత్త'




దక్షిణ పసిఫిక్ మహాసముద్రపు రాతి గుట్టలమధ్య రాకాశి నత్తలు (ఆల్చిప్పల మధ్య పెద్ద నత్తలు) నివసిస్తాయి. ఇది ఒక్కొక్కటి సుమారు 500 పౌండ్లు తూగుతుంది. ఈ నత్తచుట్టూ 2 అడుగుల పొడవైన ఆల్చిప్ప ఉంటాయి. ఈ చిప్పలను ప్రెంచి చర్చిలలో తీర్థాన్ని పెట్టడానికి ఉపయోగిస్తారు. ఈ నత్తలు సముద్రంలో మునిగి ముత్యాలు వెతికే డైవర్ల చేతులుగానీ, కాళ్ళను గానీ గట్టిగా పట్టుకుని నీటిలో ముంచేస్తాయి.

# సూప్ పురాణం

మనం పులుసు అని చెప్పుకునేది ఆంగ్లంలో సూప్ (Soup). ప్రతి దేశానికి ఇష్టమైన పులుసు ప్రత్యేకంగా ఉంది. తమిళనాడులో వత్త కుళంబు' (ఉప్పికాయల పులుసు), ఆంధ్రప్రదేశ్‌లో వంగవరుగు పులుసు, మరోచోట మెంతి పులుసు. అదేవిధంగా రష్యన్ షిచ్చ (Shchi), ఫ్రెంచి ఆనియన్ సూప్, బవేరియాన్ పీ సూప్ (pea soup),



పోలిష్ కాబేజి సూప్, బౌస్టెన్ ఫిష్ సూప్ ఇంకా ఎన్నో. ప్రప్రథమంగా 4,700 సంవత్సరాలకు పూర్వం చైనాలో వ్రాయబడిన వంటల పుస్తకం (Cook Book) పులుసులు తయారుచేసే విధానాలను వివరించింది. పావురపు గ్రుడ్డు పులుసు, వెండి సముద్రంలో బంగారు చందమామలు అని వర్ణింపబడింది.

క్రీస్తు పుట్టుటకు 3 వేల సంవత్సరాల ముందు ఈజిప్టులో మెనెస్ అనే బానిస మొట్టమొదట పులుసు తయారుచేశాడు. ఇతడు ఈజిప్టు 'ఫారో' వద్దనుంచి ఒక కోడిపిల్లను దొంగిలించి దానిని ఉడకబెట్టి పులుసు తయారుచేశాడు. దాన్ని తినేలోపుగా ఇతణ్ణి పట్టుకున్నారు. అతడిని బంధించి, పులుసుతో సహా అధికారి వద్దకు తీసుకు వెళ్ళారు. 'ఫారో' ఇతడికి మరణదండన విధించవలసిందే. కానీ పులుసు ఘుమఘుమలు వాసన చూడటంతోటే ఆశ్చర్యపడిపోయి ఆ కోడి దొంగను వంటవాడిగా నియమించాడు.

ప్రాచీన కాలంనుంచీ కూడా ఆరోగ్యాభివృద్ధికి శరీరపుష్టికి పులుసు అమోఘమైనదని

( 48 వ పేజీ తరువాయి)

రణ్యం ఉప్పు సత్యాగ్రహోద్యమంలో భారతదేశంలో అరెస్టు కాబడిన స్త్రీలలో మొట్టమొదటి స్త్రీ. ఈమె తమిళనాడు ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షురాలుగాను, మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ డెప్యూటీ స్పీకర్‌గాను పనిచేసింది. వైద్యాభివృద్ధికి మిక్కిలి కృషి సలిపి గుంటూరు మెడికల్ కాలేజీ స్థాపించడానికి పట్టుదలతో పనిచేసింది. మద్రాసులో ఇండియన్ మెడికల్ స్కూలును కళాశాలగా మార్పించింది.

* *

**సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసి (1182-1226):**

ఫ్రాన్సిస్‌కాన్ ఫ్రెయెర్స్ (Franciscan Friars) అనే రోమన్ కాథలిక్ మఠాన్ని స్థాపించాడు. తన ఆస్తిపాస్తులను దానంచేసి కూలి, నాలి చేసి బిచ్చమెత్తి బ్రతికేవాడు. నిర్దోషమైన పాతివ్రత్యము విధేయత, దారిద్ర్యము అను ప్రతిజ్ఞాత్రయంతో సౌభ్రాతృత్వానికి నిబంధనను ఏర్పరచాడు.

"మంచి కలకండను ఒక్కసారి రుచి చూచినవాడు బెల్లపు తెట్టెను తిని ఆనందింపజాలడు."

అందరూ నమ్మారు. ఇప్పుడు కూడా జపానులో అప్పుడే ప్రసవించిన స్త్రీలకు 'సీవీడ్' (స ము ద్ర పు కలుపు మొక్కలు)నుంచి తయారుచేసిన ప్రత్యేకమైన సూప్ ఇస్తారు.

పాము మాంసంతో తయారైన పులుసు అన్ని రకాల నాడీ సంబంధమైన రోగాలు, బాధలు తగ్గించి దీర్ఘ కాలం జీవించడానికి సహకరిస్తుందని కొరియా దేశస్థులు నమ్ముతారు. వెల్లుల్లి పులుసు అన్ని రోగాలకు దివ్య ఔషధం అని ఉత్తర ఆఫ్రికా మరియు మెడిటరేనియన్ దేశస్థులు నమ్ముతారు

జఠరకోశంలో కాన్సరు సంభవిస్తే కుదుర్చుకోడానికి నాటువైద్యులు పులుసు త్రాగమంటారు. ఇది భారతదేశపు వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు కూడా ఒప్పుకున్నారు. జపాన్లో 17 సంవత్సరాలనుండి 2,65.000 మందిని పరీక్షచేసి పులియబెట్టిన సోయాగింజలముద్దతో చేసిన సూప్ తింటే కడుపులో వచ్చే కాన్సరు తగ్గిపోతుందని నిర్ధారణ చేశారు. యుఎస్.లో 60,000 మంది మీద సలిపిన ఒక సర్వేలో పూర్తిగా ఆరోగ్యంగా ఉండే వాళ్ళంతా సక్రమంగా సూప్ వాడతారని తేల్చారు. బాగా లావుగా ఉండేవారు వారానికి 4 పర్యాయాలు సూపు త్రాగితే శరీరంలో చేరే అదనపు క్రొవ్వు 20 శాతం తగ్గిపోతుంది.

రష్యా వంటకాలలో అనేక రకాల పులుసు తయారుచేయడం విశదీకరింపబడింది. కాని ష్చి (Shchi) అందరూ ఎంతో ఆప్యాయంగా వాడతారు. సుమారు వెయ్యి సంవత్సరాలనుండి 'ష్చి' వాడకంలో ఉంది. తాజా కాబేజి 'ష్చి' ఇంకా అదేవిధంగా సాంప్రదాయకంగా తయారు చేస్తారు. ఘుమ ఘుమలాడుతూ కమ్మగా ఉంటుంది.

('స్పుట్నిక్' సౌజన్యంతో)

## మొత్తం రోడ్డు ప్రమాదాలలో భారతదేశంలో 6 శాతం



ప్రపంచంలో ఉన్న వాహనాలలో ఒక ం మాత్రమే భారతదేశంలో ఉన్నాయి అయినా మొత్తం రోడ్డు ప్రమాదాలలో 6 శాతం భారతదేశంలోనే సంభవిస్తున్నాయి. ప్రతి సంవత్సరం భారతదేశంలో 2 లక్షల రోడ్డు ప్రమాదాలు జరుగుతున్నాయి. ఇండియాలో 15 లక్షల కిలోమీటర్ల రోడ్లు ఉన్నాయి. భారత దేశంలో 10,000 వాహనాలకు 35 ప్రమాదాలు సంభవిస్తున్నాయి. అభివృద్ధి పొందిన దేశాలలో ఇది 10,000కు 10 కంటె చాలా తక్కువ. ప్రతిసంవత్సరం రోడ్డు ప్రమాదాలవల్ల భారతదేశంలో 350 కోట్ల రూపాయల ఆర్థిక నష్టం సంభవిస్తుంది.

అండ్ రీసెర్చ్' సౌజన్యంతో)



# మేఘాలయా

భారత దేశానికి ఈశాన్యపు దిక్కుగా ఏర్పడిన రాష్ట్రాలలో ఒకటి మేఘాలయా. మొత్తం 22,429 చ.కి.మీటర్ల పై శాల్యంగల మేఘాలయాలో ముఖ్యంగా కాశీ (Khasi) జెయింటియా (Jaintia) గారో (Garo) కొండలు ఉన్నాయి. దీని జనాభా 13,35,819.




అస్సాం రాష్ట్రంలో 1970 ఏప్రిల్ 2వ తేదీన ఒక స్వతంత్ర రాష్ట్రంగా ఏర్పడిన మేఘాలయా ప్రకృతి శోభతో అత్యంత రమణీయంగా ఉంటుంది. 1972 జనవరి 21వ తేదీన మేఘాలయా భారత రాజ్యాంగంలో చేరింది. అస్సాంలో కాశీ, జెయింటియా మరియు గారో కొండ జిల్లాలను చేర్చి మేఘాలయాను ఏర్పరచారు.

కాశీ ప్రదేశంలో నివసించే జనం ఆస్ట్రిక్ మొంఖామెర్ సముదాయానికి చెందిన ఒక భాషను మాటాడుకుంటారు. బర్మా మరియు మలయా పెనిన్సులాతో దీనికి సంబంధం కనిపిస్తుంది. గారోలభాష టిబెటో బర్మా కుటుంబానికి చెందినది. కాశీలు బర్మానుంచి వచ్చి ఉండాలని కొందరి నమ్మకం. కాశీలకు, గారోలకు వివాహసంబంధాలు జరుగుతాయి. సాధారణంగా వీరిలో వరుడు అత్త గారింట్లో నివసిస్తాడు. ఆఖరి కుమార్తెకు ఆస్థి సంక్రమిస్తుంది. మేఘాలయాలో స్త్రీలు శ్రమపడి పనిచేస్తారు.

మేఘాలయా జనాభాలో 80 శాతం షెడ్యూల్డు తరగతులకు చెందినవారు. 5 శాతం క్రైస్తవ మతానికి చెందినవారు. నాగాలాండ్‌లో సుమారు 67 శాతం క్రైస్తవ మతస్థులు ఉన్నారు. ఇచ్చటి సాంప్రదాయక సంగీతం, నృత్యం చర్చి అధికారులచే పోషింపబడుతున్నాయి. కాశీలు, గారోలు సంగీతప్రియులు. వీరి సంగీతం ముఖ్యంగా మతసంబంధమైన ఆచారాలకు, కార్యక్రమాలకు సంబంధించి ఉంటుంది ఆఫీసు వ్యవహారాలలో ఆంగ్లేయ భాష విస్తారంగా ఉపయోగిస్తారు. కాశీ, జెయింటియా, గారో భాషలు వీరు మాట్లాడుకునే భాషలలో ముఖ్యమైనవి.

మేఘాలయాలో అక్షరాస్యత 30 శాతానికి పైబడి ఉంటుంది. కాశీ కొండ ప్రదేశాలలో ఇది కొంచెం అధికం—38 శాతం ఉంటుంది. మేఘాలయా ముఖ్యంగా గ్రామీణ ప్రదేశం. రాష్ట్రంలో 85 శాతం జనాభా 4,500 గ్రామాలలో నివసిస్తారు. సగటున ఒక్కొక్క గ్రామానికి 188 మంది నివసిస్తారు. ఇక్కడ ఆరు పెద్ద నగరాలు

ఉన్నాయి. వీటిలో చేరినవే షిల్లాంగ్, టూరా, జవాయ్, చిరపుంజీ. ఒకప్పుడు చిరపుంజీ ప్రపంచంలో అధిక వర్షపాతం గల ప్రదేశంగా ఉండేది. (18,870 మి. మీల అత్యధిక వర్షపాతం)

వ్యవసాయం వీరి ముఖ్యవృత్తి. వ్యవసాయపు పంటలే వీరి జీవనాధారం. వరి, జొన్న, గోధుమ, చిరుధాన్యాలు ఇక్కడ



విస్తారంగా పండింపబడతాయి. నిమ్మజాతి పళ్ళు, అనాస, అరటి ముఖ్యమైన పండ్ల పంటలు. బంగాళాదుంప, జనపనార ముఖ్యమైన వ్యాపార పంటలు. పాలు మరియు పాలకు సంబంధించిన ఇతర వస్తువులు చాలా అధికంగా ఉత్పత్తి కాబడతాయి.

మేఘాలయాలో వడిగా ప్రవహించే నదులు అనేకం ఉన్నాయి. వీటి నుండి విద్యుత్‌చ్ఛక్తి ఉత్పాదింపబడుతుంది. ప్రస్తుతం ఇక్కడ నాలుగు జలవిద్యుత్ కేంద్రాలు ఉన్నాయి.

పారిశ్రామిక సంస్థలలో ప్రభుత్వ రంగానికి చెందిన సిమెంట్ ఫ్యాక్టరీ చిరపుంజీలో ఉంది. దారుగిరిలో కలపమిల్లు, ప్లైవుడ్ ఫాక్టరీ ఉన్నాయి. ఒక బివరేజెస్ ఫాక్టరీ కూడా ఉంది. రంపపుమిల్లులు, ఫుడ్ ప్రోసెసింగ్ యూనిట్లు, జిన్నింగ్ మిల్లులు, బేకరీలు కూడా చాలా ఉన్నాయి. భారతదేశంలో సిలిమనైటు (Sillimanite) అత్యధికంగా ఖాశీ కొండ జిల్లాలో ఉత్పాదింపబడుతుంది. సున్నపురాతి నిలువలు సుమారు 2,100 మిలియను టన్నులు ఉన్నాయి. బొగ్గు నిలువలు సుమారు 1,200 మిలియను టన్నులు. బంకమట్టి (clay) నిలువలు 10 మిలియను టన్నులు ఉంటాయి.

కపీస అవసరాల ప్రణాళిక క్రింద 500 మంది దానికి పైబడి జనాభాగల అన్ని గ్రామాలకు అన్ని కాలాలలోను అనుకూలంగా ఉండే రోడ్డు లింకులు ఏర్పాటు చేయబడుతున్నాయి. 100 బస్సులు సుమారు 25,000 కి.మీ.లు ప్రయాణ సౌకర్యం కలుగజేస్తాయి.

మేఘాలయా సహజ సౌందర్యం, ఆహ్లాదకరమైన వాతావరణం, అటవీ సంపద, వృక్ష సంపద ఎంతో మందిని ఆకర్షిస్తుంది. టూరిస్టు బంగళాలు, రెస్ట్ హౌసులు అభివృద్ధి చేయబడుతున్నాయి తూర్పు తీరపు స్కాట్లండని చెప్పబడే ఈ ప్రదేశాల్ని టూరిస్టులకు సౌకర్యంగా మలచబడుతూంది.

మేఘాలయా రాష్ట్ర ముఖ్య ప్రదేశమైన షిల్లాంగ్‌లో నార్త్ ఈస్ట్ హిల్ యూనివర్శిటీ (NEHU) స్థాపించబడింది. ఇక్కడ నార్త్ ఈస్ట్ ఇండియా కొండజాతుల సంస్కృతిని, సహజ నాగరికతను గురించి పరిశోధనకు అనుకూలాలు ఉన్నాయి.

## పగటిపూట నక్షత్రాలు చూడగలం

**బాగా లోతుగా ఉండే నూతి నీటిలో పట్టపగలు నక్షత్రాలను చూడగలము.**

[illegible]

# ప్రగల్భాలుకాదు - ఫలితాలు చూపాలి

పంతుల వెంకట రాధాకృష్ణ,
విజయనగరం

ప్రగల్భాలు అనేసరికల్లా ఉత్తర కుమారుడు గుర్తుకొస్తాడు. ఏదైనా చేసేస్తాననటం సులువే. చేసి చూపడమే కష్టం. ఏదోలా చెయ్యడం గొప్పకాదు. పూనుకున్న పని సత్ఫలితాలతో సమున్నతంగా తీర్చిదిద్దడానికి కృషి, దీక్ష, పట్టుదల అవసరం.

పని ప్రారంభింపకనే విఘ్నాలనుగురించి చింతించేవారు నీచులు. ఆరంభించిన పని మధ్యలో విడిచిపెట్టేవారు మధ్యములు. ప్రారంభించిన పని కడపటివరకూ కొనసాగించి ఫలితాలతో సంతృప్తి చెందేవారు ఉత్తములు. 'కృపణాః ఫలహేతవః' అని గీతాకారుడు చెప్పినట్టు నిష్కామకర్మను ఆచరించినప్పటికీ ఫలితాలు ఉన్నతంగానే ఉంటాయి. పని చెయ్యడమే ముఖ్యమని ప్రబోధిస్తూ ఫలితాలను ఆశించవద్దన్నాడు. ప్రగల్భంతో ప్రొద్దుపుచ్చమనలేదు.

జీవితాన్ని జీవించడానికి పని తప్పనిసరి. ఉన్నత ఫలితాలను సాధించే ఆశయంతో పని చెయ్యటం ఉత్తమం. ఫలితాలను ఆశించకుండా పని చెయ్యడం మహోత్కృష్టం. ఫలితాలు చూపకుండా కర్మ లేకుండా జీవించడం అధమం. పని చేయకుండా ప్రగల్భాలు పలకడం ఎంతో నీచం. ప్రతీ పని వెనుక దాని ఫలితం ఉంటుంది. ప్రగల్భం కర్మలో ఉండదు. ప్రగల్భాలవల్ల అవమానం, న్యూనత కలుగుతాయి. పని చెయ్యడంవల్ల విజయం, సంతృప్తి ఉంటుంది. చేసేది చెప్పకు. చేసి చూపించు.

* * *

ఎన్. కృష్ణమాచార్యులు, డోన్.

నిజాయితీ ప్రస్తుతం మన దేశంలో ఎక్కడా కనిపించదు దీనిని గురించి చెప్పేవారు లేరు. వినేవారు లేరు డాంబికము, నిజాయితీ విరుద్ధ గుణాలు. చెప్పినది చేసే వారిని నిజాయితీపరులంటాం. నిజాయితీగా ఉండడం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. అలాగని ఇది దుస్సాధ్యమని కాదు. నిజాయితీ డాంబికమువలె తియ్యని మాట కాదు. ప్రగల్భాలకు ఉండే ఆదరణ నిజాయితీకి ఉండదు. ప్రగల్భాలు మనస్సుకు ప్రియంగా

## ఒక పెన్సిల్‌తో వ్రాయగల రేఖ



ఒక సాధారణ పెన్సిల్‌తో సుమారు 60 కి.మీ. పొడవైన గీత గీయవచ్చు.

"దేనికైనా అదుపూ, పొదుపూ ఉంటేనే అందం."

తోస్తాయి. సత్యధర్మాలు శాపగ్రస్థంగా పరిగణిస్తాం.

ఒక స్త్రీ ఒక చీరల అంగడికి వెళ్ళి అసలుధరకు నాలుగు రెట్లు చార్జి చేసినా చెల్లించి ఇంటికిపోతూ డబ్బుతో ఉన్న తోలు సంచిని అక్కడే మరచిపోయిందిట! అంగడి యజమాని తరువాత ఆమె ఇంటికి వెళ్ళి ఆమె సంచిని ఇచ్చాడు. ఆమె ధన్యవాదాలు సమర్పిస్తూ 'మీ ప్రవర్తన నాకు అర్థం కావటం లేదు. అధర్మంగా ఎక్కువ ధర తీసుకుని ఈ సంచిని నాకు ఇవ్వడంలో మీ నిజాయితీ నాకు అర్థం కావటం లేదు' అంది.

దానికి అతడు 'అమ్మా! అక్రమ ధర చెప్పి లాభం సంపాదించడం నా వృత్తి ధర్మం. మరచిపోయిన సంచిని వాపసు చేయడం నా వ్యక్తి ధర్మం' అన్నాడు. ఇట్టి విరుద్ధ ధర్మాన్ని సహిస్తాం. అధర్మాన్ని అధర్మంగా గుర్తించలేకున్నాం.

ఎక్కువ ప్రగల్భాలు పలికేవాడు ఆచార శూన్యుడని గుర్తించుకుని ఫలితాలను అడిగే ధైర్యం మనం సంపాదించుకున్నప్పుడు ప్రగల్భాలకు విలువ ఉండదు.

* * *

ఎమ్. లక్ష్మణస్వామి, శ్రీకాకుళం.

మాటకారితనం మంచిదే కావచ్చు. కానీ అవి వట్టి ప్రగల్భాలు కాకూడదు. తల విలువ నాలుక చెబుతుందంటారు. కొంతమంది మాట్లాడే తీరు ఆకర్షణీయంగా కనిపిస్తుంది. కానీ ఆశయాలను వల్లిస్తూ ఆచరణలకు తిలోదకాలు ఇచ్చేవారి మాటలు వాచాలత్వం అనిపించుకుంటాయి. ఆ మనుష్యులకు విలువ ఉండదు.

పట్టుపట్టిన మొనగాడు అంతు చూడాలి. కేవలం ఉత్తరకుమార ప్రజ్ఞలు పలికి నలుగురిలో అవమానం పొందిన ఘనులు నేటి సమాజంలో కోకొల్లలు.

సత్ఫలితాలను సాధించాలనే పూనిక గలవారు తూచి మాట్లాడతారు. తమ ప్రయత్నం సఫలీకృతం కావడానికి మనోవాక్కాయ కర్మలద్వారా కృషి చేస్తారు. అట్టి పూనికా, కృషీ సఫలీకృతం అయి తీరుతుంది.

ఈ సందర్భంలో 'వట్టి మాటలు కట్టిపెట్టి, గట్టిమేల్ తలపెట్టవోయ్' అనే గురజాడవారి మాటలూ, కరోపహిలే. కహో పీచే-ముందుగా పనిచెయ్యి తరువాత కబుర్లు చెప్పు అనే గాంధీజీ మాటలు ప్రగల్భాలు పలికేవారికి కనువిప్పు కలిగిస్తాయి.

## కష్టసుఖాలలో సమభావం వహించు



దేశ కాలాలకు అనుగుణ్యంగా జీవితాన్ని సరిపెట్టుకోవాలి. కష్టాలకు క్రుంగిపోకూడదు. సుఖాలకు పొంగిపోకూడదు. కష్టమో, సుఖమో సమభావాన్ని పోగొట్టుకోకూడదు. అతిస్నేహం పనికిరాదు. వైరం వహించకూడదు. రెండూ దోషాలే కాబట్టి మధ్యమార్గాన్ని అవలంబించాలి. —రామాయణం

ఆగస్టు 1988

విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీకాఎంట్రీ విడిగా పావుఠావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతీ ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితంమీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 15 లు, రూ. 10 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: ఆగస్టు 20, 1988. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్డమ్', 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు-600 004. — సంపాదకుడు.

## వ్యాసం

జీవితం నాకు నేర్పిన గుణపాఠం' అనే అంశంమీద 200 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. షెడ్యూల్డు ట్రైబ్స్ అత్యధికంగా గల ప్రదేశం:

(ఎ) మధ్యప్రదేశ్ మరియు ఒరిస్సా, (బి) రాజస్థాన్ మరియు ఉత్తరప్రదేశ్, (సి) బీహారు మరియు పంజాబు, (డి) అస్సాం మరియు పశ్చిమ బెంగాల్.

2. 'ఇండియన్ పీనల్ కోడ్' చట్టం ప్రకారం ఎప్పుడు ఒక నేరము (Cognizable) గా పరిగణింపబడును?

(ఎ) నేరముఉద్దేశ పూర్వకము కానపుడు, (బి) నేరస్థులు 16 సంవత్సరాలలోపు పిల్లలు అయినప్పుడు, (సి) 4 సంవత్సరాల కంటే తక్కువ కాలం కారాగారశిక్ష విధింప

## గరుడపక్షి పక్షులకు రాజు



గరుడపక్షిని (Eagle) ప్రాచీన కాలం నుంచి అధిక శక్తికి చిహ్నంగా వాడు

పతాక చిహ్నం కూడా ఈ పక్షి. మాలయ కాలంలో రోమను సైనికులు పతాక చిహ్నం కూడా ఈ పక్షే. ఇప్పటికీ చాలా ఆధునిక దేశాలలో ఇదే చిహ్నం వాడుతున్నారు. క్రైస్తవ చిత్రకళలో కన్ను మూయకుండా సూర్యతేజస్సును చూడగల ఈ పక్షి సెంట్ జాన్‌ను తెలియజేస్తుంది. ఇదే తిరిగి లేచిన క్రీస్తుకు కూడా గుర్తు.

"మానవులు ఎవరికివారే ప్రత్యేకతను సాధించాలి అనే ఆకాంక్షలో ఐక్యతను పొందలేకపోతున్నారు."

బడినప్పుడు, (డి) నేరం కోర్టు అధికార పరిధిలోకి వచ్చినప్పుడు.

3. ఒక దేశంలో జీవితప్రమాణం తెలియ జేయునది:

(ఎ) తలసరి ఆదాయం (per capita income) (బి) దారిద్ర్య విస్తృతి (poverty ratio) (సి) జాతీయ ఆదాయం (National Income) (డి) నిరుద్యోగ ప్రమాణం (Unemployment rate).

4. 1985 వ సం.లో సంభవించిన ఘోర ప్రమాదంవల్ల 20,000 ప్రజలు మరణిం చారు. ఇది:

(ఎ) భోపాల్ విషవాయువు ప్రమాదం, (బి) ఇటలీలో అగ్నిపర్వతం ప్రేలుడు, (సి) మెక్సికోలో భూకంపము, (డి) యు ఎస్ఎలో ఫ్లాష్ఫ్లడ్స్ (అకస్మాత్తుగా వచ్చిన వరదలు.)

5. క్రింది వాటిలో ఏ కవి గ్రంథముల జత క్రమమైనది?

(ఏ) షహనామా ఫిర్‌దౌసి
(బి) రత్నావళి బాణభట్టుడు
(సి) బాబర్‌నామా హుమాయూన్
(డి) రామచరిత్‌మానస్ -సూర్‌దాస్

6. సూర్య గ్రహణములు సంభవించు దినము:

(ఎ) పౌర్ణమి, (బి) అమావాస్య, (సి) చవితి, (డి) ఏరోజైనా.

7. ఏ పంట పండించడానికి నీరు నిల్వ ఉండాలి?

(ఎ) ప్రత్తి (బి) వరి (సి) తేయాకు (డి) నూనెగింజలు.

8. వ్యర్థ పదార్థాలు దీని ఉత్పత్తికి వాడ బడతాయి:

(ఎ) ఆల్కహాల్, (బి) బయోగాస్, (సి) స్టార్చి, (డి) ఇవి ఏవీ కావు.

## పజిల్












ఆధారాలు - అడ్డం: 1. కావ్యాలలో శృంగారాది రసగ్రహణ కౌశలము, 3. కలి యుగ వైకుంఠంగా ప్రసిద్ధిపొందిన పవిత్ర యాత్రాస్థలము, 5. కుబేరుడు, 6. మృతి పొందిన దినము, 8. తెలుగులో రాగతాళ విలంబముతో కూడి అభినయానికి అనుకూ లంగా ఉండే గేయ రచనలు, 10. చెవిటి వాడు, 12. సాగరము, 14. బిరుదు, 15. అడ్డు తిరిగిన 'రహదారి', 16. శృంగార విలాసములు.

నిలువు: 1. అడ్డు (1). 2. దాని సంబంధ మైనది, 3. భ్రష్టుడైనవాడు అనే మాటలో అక్షరాలు చెదిరాయి, 4 దువ్వెనివెంద్రుకలు, 7. కొలువుకూటము, 9. రికార్డుల కట్ట, 10. సరియైన, 11. శృంగార పురుషుడు అను మాటలో మూడవ అక్షరం 'ఉకారానికి బదులు 'ఇ' కారముతో క్రిందినుంచి పైకి, 12. రవిక అను అర్థమిచ్చే మాటలో అక్ష రాలు చెదిరాయి, 13. తీక్షణమైనవి.

## తెలివికి పరీక్ష

1. క్రింది వారందరికీ సమాన అంశం ఏమిటి?

(ఎ) జోతిబాసు (బి) జె.బి. పట్నాయక్ సి) శరాద్ పవార్ (డి) దేవిలాల్ (ఇ) ఇ. కె. నాయనార్.

2. ఈ క్రిందివాక్యాలలో 'తగులు' అను పదము ఎట్లు వాడబడుచున్నది?

(ఎ) ఈ దొడ్లో నాలుగు నిలువల లోతున నీరు పడుతుంది.

(బి) వానికి నాలుగు చివాట్లు ప్రాప్తించాయి.

(సి) కాలువలో నీరులేక పడవలు మెరక పడుతున్నాయి.

(డి) గోదావరికి క్రొత్త నీరు వచ్చింది.

3. పరమాత్ముడు అనంతకోటి జీవరాశులలోను, అనంతవిధాల, అనంతరూపాలలో క్రీడించగల నటనాచతురుడు కనుక అతని బిరుదు ఏమిటి?

4. బ్రిటిషు ప్రభుత్వం నిషేధించిన మొట్టమొదటి తెలుగు నవల ఏది? కర్త ఎవరు?

5. తెలుగు భారతం నన్నయ, తిక్కన, ఎర్రన రచిస్తే గీరతం ఎవరు రచించారు?

6. ఈ క్రింద వాటిలో సరిపడని పేరు ఏది?

(ఎ) రుక్మిణి, (బి) ద్రౌపది, (సి) సత్యభామ, (డి) జాంబవతి.

7. అమూల్యమైన కోహినూరు డైమండ్ చిట్టచివర ఏ భారతీయుని అధీనంలో ఉంది?

8. భారతీయ రాజ్యాంగ విధానము డ్రాఫ్టును తయారుచేసిన కమిటీ చెయిర్మెన్ ఎవరు?

> ఎస్డమ్
> పోటీల కూపన
> ఆగస్టు 1988

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని అర్థాలను సూచించండి:

1. అలమట: బాధ (ఎ), దుఃఖము (బి), శ్రమము (సి), స్వేదము (డి).
2. అల్లిబిల్లి: అబద్ధము (ఎ), కలసి మెలసియున్న (బి), ప్రియమైనది (సి), కూర్పు (డి).

**ఎప్పుడూ ప్రశంసింపబడేవాడు ఎక్కడా ఉండడు**

ఏ గ్రంథపు విలువైనా పాఠకుని పూర్వజన్మ సంస్కారాన్ని అనుసరించి అంతఃకరణపై ఎవరికి వారు ఆవిష్కరించుకోవాలి."

## వినోదమ్
### పోటీల కూపను

**అగస్టు 1988**

3. ఆయువారము: ఏడు వారాలలో ఒకటి (ఎ), చెట్లు మొదట త్రవ్విన పల్లము (బి), ఇంటింటికి తిరుగుచూ యాచించుట (సి), యాచించుట వల్ల వచ్చిన బియ్యము (డి).

4. ఈసు: అసహనము (ఎ), కోపము (బి), పగ (సి), నింద (డి).

5. ఒయ్యారి: సుందరుడు (ఎ), విలాసము గల స్త్రీ (బి), వంకర (సి), ఆలోచన (డి).

6. సంసారము: కాపురము (ఎ), జనన మరణ ప్రవాహము (బి), ప్రాపంచిక వ్యామోహము (సి), సర్వోత్తమము (డి).

7. సాగనంపు: మైత్రి (ఎ), సంబంధము (బి), వెంటవెళ్లుట (సి), ప్రయాణమై వెళ్ళేవారితో కొంతదూరము వెళ్ళి విడుచుట (డి).

8. మేలు: శ్రేష్ఠత (ఎ), వరము (బి), ఉపకారము (సి), సుఖము (డి).

## మూకీచిత్రవ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక చిత్రానికి తగిన శీర్షిక వ్రాసిపంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా 15 మాటలకు మించకుండా చమత్కారమైన వ్యాఖ్య వ్రాసిపంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. 5లు ఖరీదుచేసే పుస్తకం బహుమతి.

పొదుపు నేర్చుకో" అం మీరు ఏంచేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## ఆత్మ దర్శనం చేసుకో



శత్రువుయందు శత్రుత్వం మిత్రునియందు, బంధులయందు మిత్రత్వం వహించకు. ఇటువంటి భేదభావాలు పెంచుకోకు. అందరిలో, అన్నిటిలో ఆత్మదర్శనం చేసుకుని అజ్ఞానం పోగొట్టుకో. ఒకరియందు శత్రుత్వం మరియొకరియందు మిత్రత్వం వంటి విభిన్న ప్రవృత్తులకు తావీయకుండా నిన్ను నీవు చూసుకునేటట్టుగా అందరిని చూడు. భేదభావంతో కూడిన అజ్ఞానం నశిస్తే ఆత్మదర్శనం కలుగుతుంది. ఆత్మదర్శనం కలిగించుకోడానికి గోవిందుని భజించడం ఒకటే మార్గం. —శంకరాచార్య

[illegible] చదవడం కాదు
[illegible] కలిగించడం కావాలి

(జూన్ 1988)

వ్యాసం - విజేతలు - మొదటి బహుమతి: జి. జగన్మోహన్‌రావ్, ఖమ్మం; రెండవ బహుమతి: కోగంటి సాంబశివరావు, తెనాలి (గుంటూరు జిల్లా); మూడవ బహుమతి: పంతుల దక్షిణామూర్తి ప్రసాద్, విజయనగరం.

క్విజ్ - జవాబులు 1. (ఎ) యూరి గగారిన్, 2. (సి) ఆర్.కె. నారాయణ్, 3. (డి) మైకా, 4. (ఎ) యాంత్రిక శక్తిని విద్యుత్ శక్తిగా, 5. (డి) ఐకెబానా (Ikebana), 6. (సి) 1951, 7. (డి) వెల్లింగ్‌టన్, 8. (సి) గోదావరి.

విజేతలు - మొదటి బహుమతి: కె. శ్రీకృష్ణసాయి, సోమేశ్వరం, (తూ. గో. జిల్లా); రెండవ బహుమతి కె. మోహన్‌రావ్, వెంకటయ్య పాలెం, (తూ గో. జిల్లా); మూడవ బహుమతి: ఎస్. వెంకట గౌరీ శంకర్, తిరుపతి.

పజిల్ - జవాబులు — అడ్డం: 1. నన్నయ తిక్కన ఎర్రన, 5. మల్లినాధుని వ్యాఖ్యానము, 6. ఉవిద, 8. లక్ష్మీకాంతుడు హరి, 10. బద్ధత్వము, 11. మువమురి.

నిలువు. 1. నవసుమకోమలములు, 2. తిమ్మనాధుని కౌతుకము. 3 ఎరువు ఖ్యాతి ఉరి, 4. నరకము, 7. దశనరి, 9. హయాము.

విజేతలు - మూడవ బహుమతి: సత్తి వెంకటరెడ్డి కవిటం, (ప గో. జిల్లా).

తెలివికి పరీక్ష - జవాబులు: 1. 4,7; 2. పొట్టుచే కప్పబడిన వడ్లగింజ పొట్టు పోయిన వెంటనే బియ్యము. అట్లే కరతె బద్ధుడు కర్మ విముక్తిచేత శివుడు అగుచు న్నాడు, 3. భావవాదము, 4. (ఎ) పదిమంది నడిచింది బాట పదిమంది పలికింది మాట, (బి) ఏమీ లేనిచోట ఆముదపు చెట్టే మహా

## డినోసార్స్ మైదానం


DINOSAUR

150 మిలియను సంవత్సరాలకు పూర్వం మిక్కిలి పెద్ద సరీసృపం - డినోసార్ సోవియెట్ యూనియన్ చార్‌షాంగా జిల్లాలో కొజీఫిల్ గ్రామం దగ్గర టుర్క్‌మేనియా కుగిటాంగ్‌టావ్ పర్వతాలకు చేరువగా వివసించినట్లు వీటి పాద చిహ్నాలవల్ల తెలుస్తూంది. ఇక్కడ నివసించే ప్రజలు దీనిని డినోసార్ మైదానం అంటారు. ఈ బ్రహ్మాండమైన బల్లుల పాద చిహ్నాలు సుమారు 500 దాకా ఇక్కడ ఉన్నాయి.

—'సోవియెట్ యూనియన్' సౌజన్యంతో

'అల్పమైన కాలం మనఃస్థితిపైన, భావాలపైన ఆధారపడి ఉంటుంది.''

వృషభము, 5. గరిమెళ్ళ సత్యనారాయణ, 6. వరవిక్రయం; ఎంకిపాటలు; మాలపల్లి; 7. 127, 8. సునీల్ మనోహర్ గవాస్కర్.

విజేతలు-రెండవబహుమతి: తెంబూరు గానం, కొరసండ, (గంజాం జిల్లా); మూడవ బహుమతి: వి. కృష్ణమూర్తి, చెన్నూరు (కడప జిల్లా).

మాటల మహిమ - జవాబులు: 1. అపవాదము (ఎ), వేదపాఠము (బి), సామీప్యము (సి), నిర్ణయించిన రోజున ఏర్పాటైన అంగళ్ళ వరుస (డి); 2. హారము (ఎ), దండ (బి), మీగడ (సి); 3. పాపట (ఎ), అక్షతలు (బి), పుష్పాంజలి (సి); 4. సగము (ఎ), వ్యాయామము (బి); 5. విరుచు (ఎ), త్యజించు (బి); 6. జాడ (ఎ), పోలిక (బి); 7. కలహము (ఎ), చాడీ (బి); 8. వ్రతము (ఎ), పోగొట్టు (బి)

విజేతలు - మొదటి బహుమతి: ఎస్. భరత్‌కుమార్, విజయవాడ; రెండవ బహుమతి: పులిపాటి రామమోహనరావ్ విజయవాడ; మూడవ బహుమతి: గోపరాజు పూర్ణ సుధాకర్ గుంటూరు.

ముఖచిత్ర వ్యాఖ్య - రెండవ బహుమతి: బి. ఉమామహేశ్వర రావు, కవిటి, (ప్రకాశం జిల్లా); మూడవ బహుమతి: తెంబూరు గానం, కొరసండ, (గంజాం జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - రెండవ బహుమతి. వాసా రామలింగేశ్వరరావు, రామచంద్రపురం (ప.గో. జిల్లా); మూడవ బహుమతి. కొండూరు చంద్రశేఖర్, గుంటూరు.

మీరైతే ..? - మొదటి బహుమతి: బి. రాజ్‌కుమార్, సుబేదారి, (వరంగల్ జిల్లా); రెండవ బహుమతి: డి.జి. శంకర శ్రీనివాస్, గంగచోళ్ళ పెంట, (విజయనగరం జిల్లా); మూడవ బహుమతి: ఎ. గీతాంజలి, మచిలీపట్నం.

# ప్రపంచంలో 1000 మిలియను మందికి వసతి సౌకర్యాలు అవసరం



ప్రపంచంలో ఒక బిలియను (1000 మిలియను) మందికి పైగా పేదవారికి ఉండడానికి చోటులేదు. వీరిలో సుమారు 100 మిలియనుమంది వీధులలోను, బ్రిడ్జిలక్రింద, పార్కులలోను నిద్రపోతారు. లాటిన్ అమెరికాలో 20 మిలియనుమంది పిల్లలు, యువకులు వీధులలోనే నివసిస్తారు. పట్టణవాసులలో సుమారు 80 శాతం అనారోగ్యమైన పరిసరాలలో నివసిస్తున్నారు. అమెరికాలో కూడా 2.5 అమెరికనులకు ఉ

—'ఇంటరే

"నిస్వార్థ జీవితం, నిశ్చలంగా నిలబడగల శేముషి, శెంపు విజయానికి కీలకాలు."

